SRIMAD
RAMANUJA
CHARITRAM.
TELUGALANGUAGE

శ్రీ వైష్ణవము.

# శ్రీమద్రామానుజ చరిత్రము



సంస్కృత ప్రపన్నామృతము ననుసరించి

ఆంధ్రవచనముగా,

సరస్వతి రంగాచార్యులవారిచే వ్రాయఁబడి

కొమాండూరు - తిరువేంకటాచార్యులచే

యంప్రెస్ ఆఫ్ యిండియా ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రకటింపఁబడియె.

MADRAS.

1903.

# ప్రకటన.



ఈ గ్రంథమును మఱి యితరములగు సంస్కృతాంధ్ర గ్రంథమును వలయువారలు; కొమాండూరు తిరువేంకటాచార్యులు, బుక్కు సెల్లర్-అండ్ పబ్లిషర్ 4 వ నెంబరు, ధర్మరాజుగుడివీధి, చాకలపేట పోష్టు - మదరాస్ - అని వ్రాసి ముందు పైకమును పంపిగాని, వి-పి ద్వారా గాని గ్రంథములను తెప్పించుకొనవచ్చును.

ఈ గ్రంథముక్రయము, రూ. 1-0-6

వాల్యూపేయబిల్ గా, రూ. 1-3-0.

# ఉపోద్ఘాతము

శ్రీమద్రామానుజావతార కారణమును, అతడు చేసినకృత్యములయొక్కయు అతడుసంస్థాపించినసిద్ధాంతముయొక్కయు ఔచిత్యమును ఆధిక్యమును గనుగొనుటకు తత్పూర్వమత సిద్ధాంతజ్ఞానము త్యావశ్యకము. సుమారు ఇరువదియైదుశతాబ్దములక్రింద నీదేశమున మతజ్ఞానము నశించి వేదమూర్తులుగనుండవలసినబ్రాహ్మణులుగూడ కొందఱజ్ఞానముచేతను కొందఱజ్ఞానులయ్యు స్వప్రయోజనాభిలాషముచేతను అనేకదుష్కార్యములు సేయుచు యజ్ఞములకని మిషపెట్టి ఇతరజాతులవారి జీవధనమంతయు దోచికొని జీవహింస గావించుచు పాపములపాలై చెడిపోవుచుండిరి. ఇట్టిసమయమున మహనీయుడు బుద్ధదేవుడవతరించె. బౌద్ధమతము నాస్తికమతసమానమని యీదేశస్థులకు ఒకదురభిప్రాయము గలదు. బుద్ధుడు బోధించినవిషయములలో నొక్కటైనను వేదవిరుద్ధమైనది లేదు. ఐన నాకాలమున బ్రాహ్మణు

లనేకదుష్కార్యములు సేయుచు వానిని వేదములకర్థముసేసి వానినుండి ప్రమాణములచేసాధించుచు, జనులను మోసపుచ్చుచుండినందున బుద్ధదేవుఁడు స్వతంత్రబుద్ధికి సర్వప్రాముఖ్యము నొసఁగినఁగాని యీదురాచారములను దురభిప్రాయములను నిర్మూలనము సేయుట సాధ్యపడదని తలఁచి మనుజుని కతనిబుద్ధికన్న నధికప్రమాణము లేదని సిద్ధాంతీకరించె. " దేనినైనను వేదములయందున్నమాత్రముచేతనే విశ్వసింపకుఁడు. ఏయాచారమైనను ఆనుపూర్వికమనియే అవలంబింపకుఁడు. ఏయభిప్రాయమైనను ఏమతమైనను మీపెద్దలవలన వచ్చినదనియే నమ్మకుఁడు. మీస్వతంత్రబుద్ధిని వినియోగించి యాలోచించి చూచి ఎద్దిసత్యమని మీకుఁదోఁచునో దాని నవలంబిఁపుఁడు ఎద్దిఅసత్యమనితోఁచునో దానిని నిరాకరింపుఁడు" ఇది బౌద్ధమతసిద్ధాంతము. ఇందుహిందూమతవిరుద్ధధర్మము లెవ్వియేని గలవా? దైవమువిషయమై బుద్ధునియభిప్రాయమును బరిశీలించికాఁబోలు హిందువులు బౌద్ధమతము నాస్తికమతసమానమనియభిప్రాయపడియున్నారు. అప్పుడుహిందువులుదురాచార

ములకు లోనై దుష్కృత్యములఁ గావించుచు ఎల్లప్పుడు వృథావాదములయందుఁ గాలయాపనము సేయుచుండిరి. తమప్రవర్తనను బాగుపఱచికొనుట కెట్టిప్రయత్నమును లేక దైవస్వరూపము గుఱించి ఎడతెగనివాదములు సేయుటవలన నేమిప్రయోజనము? దీనినిజూచి దైవస్వరూపమును వాదము సేసి నిరూపింపరానిదని తెలిసినవాఁడు కావున బుద్ధదేవుఁడు, "దైవమున్నాఁడో లేఁడో అని కూడ విచారించుట మనకనవశ్యము; మన మెప్పుడు సంసారపాశమునఁ జిక్కి జననమరణచక్రమున పరిభ్రమించుచు దుఃఖసాగరమగ్నులమై యున్నారము. మనపూర్వకర్మముననుసరించి మనకిప్పుడు సుఖదుఃఖములు కలుగుచుండు. సర్వము కర్మసాధ్యము. భగవంతుఁడుకూడ కర్మముసేయనివారికి ఫలముల నియ్యఁజాలఁడు కాన సత్కర్మములఁ జేయుఁడు. భగవంతుఁడున్నమీకేమి లేకున్నమీకేమి? మీరు కర్మముసేసినఁగాని ఏప్రయోజనమును గాని పొందలేరు. ఐన కర్మఫలముల నపేక్షించుటచే మనుష్యుఁడు పునర్జన్మమును బొందును. యోగబలముచేతను జ్ఞానబలముచేతను కర్మమును దగ్ధము గావింపవచ్చు. అట్లు

నేసినవాఁడు పునర్జన్మరహితమగుమోక్షమును (నిర్వాణమును) పొందును " అనిబోధించెను. ఇందెద్దియైనవేదవిరుద్ధధర్మమూకలదా? బుద్ధుఁడు దేవుఁడు లేఁడని వాదింపలేదు. ఆ విచారమే అనవశ్యమనిస్థాపించె. ఐనఅప్పుడెట్లు స్థాపించినఁగాని జనులమనంబులు వృథావాదములనుండి మరలునట్లులేకపోయెను. బుద్ధుఁడు కర్మయోగప్రతిష్ఠాపకుఁడు. బుద్ధుఁడు బోధించినధర్మముల జనులు చక్కఁగ నవలంబించి, బౌద్ధమతమే (అనఁగా బుద్ధుఁడుబోధించినమతము) ఈదేశమున నిలిచియుండిన నీదేశమిట్టిహీనస్థితిని బొందియుండదు. ఐన మనదురదృష్టమేమో కాని బుద్ధుని వెనుక కొన్నిశతాబ్దములకే అతఁడు బోధించినవిషయములస్వారస్యమును ఔచిత్యమును గనుఁగొనలేక జనులు వాని కపార్థములుచేసి బౌద్ధమతమనుపేర నాస్తికమతము నవలంబింపసాగిరి. బుద్ధుఁడు " మీ బుద్ధికి సరిపడనివిషయములు వేదములందున్నను నమ్మకుఁడు" అనిబోధించిన దాధారముగ పిమ్మట బౌద్ధులు వేదములప్రమాణములని వాదింపదొడఁగిరి. ఛూచిత్రా మతముక్షీణించుమార్గము! జనులకునానాఁటికి వేదములయందు విశ్వా

సముక్షీణింపసాగెను. అప్పుడు (సుమారు రెండు వేలసంవత్సర ములక్రిందట) శ్రీశంకరాచార్యు డవతరించి వేదములు దైవదత్తములనియు ప్రమాణములనియు నిరూపించి హిందూమత సత్యస్వరూపమును జనులకు బోధించి స్వమతోజ్జీవనము గావించె. అప్పటికి దేశమున ననేకమతము లేర్పడి యుండినందున శంకరాచార్యుఁడు స్వమతస్థాపనమునకై ఘోరయుద్ధము సేయవలసివచ్చె. కాన నతఁడు ప్రతిపక్షమతమును నిరంకుశముగ ఖండించెఁగాని ఉపనిషదుపదిష్టమతమునుమాత్రము విస్పష్టముగ నిరూపింపఁడయ్యె. కాన నతని సిద్ధాంతముకూడ అపార్థములకవకాశ మిచ్చెను. ఇప్పుడు అద్వైతులు పరబ్రహ్మమొక్కటియే సత్యమనియు తక్కినదంతయు మిథ్యయనియు వాదింతురు. శంకరాచార్యమత మట్లుగానుపింపదు. బొంబాయిహైకోర్టుజడ్జిగారగు రానడీగారు ఇట్లువ్రాసియున్నారు. * బుద్ధునివెనుకబౌద్ధమత మెట్లుక్షీణించెనో అట్లె శంకరాచార్యుని వెనుక." అహంబ్రహ్మాస్మియనిజను

---

* The Philosophy of Theism p. 11.

As a matter of fact both before Sankaracharya's time and after his death the modified (Advaita) system of Ramanuja has played a great part in Indian philosophy

లహంభావమును బొంది దైవభక్తిలేక సదాచారసంపత్తిచే విడువఁబడి విచ్చలవిడిగ సంచరింపఁ దొడఁగిరి. నేనే బ్రహ్మమైన, దైవభక్తియేల? గురుశుశ్రూష యేల? ఇట్లు దురభిప్రాయపడి జనులు చెడిపోవుచుండు సమయమున వైష్ణవమతోద్ధారకుఁడును భక్తిమార్గప్రతిష్ఠాపకుఁడునగు శ్రీభగవద్రామానుజాచార్యుఁ డవతరించెను. వైష్ణవమతమువంటి ధారాళాభిప్రాయములుగలమతము హిందూమతోపభాగము

---

and to it may be traced the rise and progress of Vaishnava sects throughout India, which sects have attained to a higher and truer conception of Theism than any of the other prevailing systems. In Sankaracharya's own system the existence of objective nature was not categorically denied. The position taken up was that neither existence nor non-existence could be affirmed in regard to it in the same sense in which the human soul and the supreme spirit are known to exist. Besides Sankaracharya freely admitted that the supreme existence, Brahman, as soon as it conceived the idea of creation became, by reason of that thought, creator and all that was created had phenomenal existence. For all practical purposes this philosophy is theistic in its beliefs. The European thinkers, on the other hand, have exaggerated this doctrine so as to negative all other existence.

లలోను నెద్దియు లేదు. ఐనను రామానుజార్యుఁడు బోధించి నయాంశములలో నొక్కదానినైనను ఇప్పటివైష్ణవు లవలంబించుట లేదు. రామానుజార్యుఁడు తిరుకచ్చినంబి యుచ్ఛిష్టమును భుజింప నపేక్షించుటచేతను అతనిని తనకుపంచసంస్కారము సేయుమని ప్రార్థించుటచేతను శీలమే ప్రధానముకాని జాతి ముఖ్యము కాదని నిరూపించె. పెరియనంబి పంచముఁడగు మారనేర్ నంబికి పరిచర్య చేయ లేదా? అట్టి మహాత్ములే హీనజాతుల నెంతో గౌరవించి యున్నను ఇప్పటి వైష్ణవుల శీలమెంత! వీరియోగ్యత ఎంత! వీరు హీనజాతులవారిని దిరస్కరించుచున్నారు! మనము పంచముకులస్థులు మనమతములోనున్నంతవఱకు వారిని నిరాకరింతుము. క్రైస్తుమతమునో మహమ్మదీయమతమునో అవలంబింపఁగానే వారి నింటికి రప్పించి గౌరవింతుము. ఇంతకన్నహాస్యాస్పదమగువిషయము కలదా? రామానుజార్యుఁడు అద్వైతుల వాదమున నోడించి పంచసంస్కారసంపన్నులఁ గావించి తనమతమునఁ జేర్చికొనుచుండె. అతఁడు మనకు మార్గదర్శికదా? మనము మాత్ర మట్లేల చేయఁగూడదు?

హిందువులలో నిప్పుడొకగొప్పదురభిప్రాయము నా టుకొనియున్నది. ఒకమతాచార్యునిప్రవర్తనను దానియుద్దే శమును వారికి తెలియనే తెలియదు. రామానుజాచార్యులవంటి యొకగొప్పమతాచార్యుఁ డొకపనిచేసిన తాము ను ఆపనిచే సి అతనిమార్గము నవలంబింపవలయునని వారికి తెలిసినట్టు లుండలేదు. మతాచార్యులుగొప్పవారు; వారేమైనచేయవ చ్చు; చేయఁగలరు. మనమాపనులను చేయఁగలమా? చేయకలి గినను చేయవచ్చునా? అనియొకదుర్వాదము హిందువులలో ప్రబలియున్నది. మతాచార్యులు లోకమునకు మార్గదర్శకు లై వారిప్రవర్తనను మనమవలంబింపవలసిన యావశ్యకము లేకపోయిన రామానుజాచార్యునివంటి మహాపురుషులీలోక మున నవతరించియే యుండరు. వారవతరించుటలో నుద్దేశ మే వేదవిహితకర్మముల దామాచరించి లోకమునకు మార్గ మునుజూపుట. ఇట్టులుండ వారిప్రవర్తన నవలంబించుట మనకవశ్యకర్తవ్యముకదా? కాఁబట్టి వైష్ణవులందఱు నిక మీఁద కూపస్థమండూకములవలెనుండక ఇతరమతస్థులను తిరస్కరింపక వారజ్ఞానులనియు తామేజ్ఞానులమనియు త

మకు దృఢముగా తెలిసియున్నను పారియజ్ఞానమును జూచి హేయపడక • వారికి తమమతమును కొంచెకొంచెముగా నుప దేశించి శ్రీరామానుజార్యుని మహిమలోకమునకు వెల్లడిసేసి నంగాని తనకునుతమ దేశమునకును క్షేమముకలుగఁజాలదు.

శ్లో॥ వర్ణాశ్రమాచారపరస్సప్త జన్మాని యోద్విజః
ఏకాన్తసూర్యభక్తస్స్యాత్సవిప్రస్సప్తజన్మసు
తత స్సత్పుణ్యమాహాత్మ్యా ద్రుద్రభక్తోభవిష్యతి
తథైవసప్తజన్మాని శివభక్తిపరాయణః
మహాతా తేనపుణ్యేన వైష్ణవత్వంలభేతసః
విష్ణుభక్తిపరస్సత్వత్సప్త జన్మానిమానవః
ఏకాన్తభగవద్యాజీ విప్రోభాగవతాన్వయే
తతస్సలభేతేజన్మ దేవైరపిసుదుర్లభమ్.

అనివరాహపురాణమున చెప్పఁబడియున్నది. ఇంతెంత సత్యమున్నను లోకగురువగు రామానుజార్యుని శిష్యపరంపరలోఁ బుట్టఁగలుగుట బహుజన్మసుకృతపరిపాకముచేతనే అని దృఢముగా చెప్పవచ్చును. ఇట్టిజన్మమును వ్యర్థపుచ్చక.

శ్లో॥ ఆచార్యో వేదసంపన్నః విష్ణుభక్తో విమత్సరః
మన్త్రజ్ఞో మన్త్రభక్తశ్చ సదామన్త్రాశ్రయశ్శుచిః.
గురుభక్తిసమాయుక్తః పురాణజ్ఞో విశేషతః
ఏవంలక్షణసంపన్నః గురురిత్యభిధీయతే.

ఇట్టిగుణములుగల గురుఁడీకాలమున లభింపకపోయి నన్ను ఏకలవ్యుఁడు ద్రోణాచార్యుని విగ్రహమును బూజించి కోదండపాండిత్యమునంది నట్లుగురువర్యుఁడగు రామానుజాచార్యుని చరిత్రమును బఠించి అతనిపాదకమలములను మనంబుల నిలిపి తత్ప్రవర్తన ననుసరించుట యావద్వైష్ణవుల కవశ్యకర్తవ్యము. ఉపదేశమును బొందనిచ్ఛ వాస్తవముగ నెవ్వనికేని కలిగిన ఉపదేశింపఁగలగురువు కలుగకపోఁడు. సర్వేశ్వరుఁడు తానే గురువేషమును ధరించి వచ్చును. ఐన రామానుజాచార్యుఁడు తిరుకోట్టియూరునంబియొద్దతిరుమన్త్రోపదేశమ్ము నొందుటకు పడినంతశ్రమపడి జ్ఞానబోధము నొందుటకిప్పుడెవరైనసిద్ధపడియున్నారా! బౌద్ధమతము వలన మనదేశము మరల మహోన్నతపదవిని పొందియుండును. ఐన మనమాసమయమును కోలుపోయితిమి. ఇంకనిప్పుడు స్వదేశో

జ్జీవనము వైష్ణవమతమువలననే సాధ్యము వైష్ణవమత మనుటచే. ఇప్పుడు వైష్ణవులవలంబించి యున్న మతమని కాదు మాయభిప్రాయము, శ్రీరామానుజార్యునిచే బోధింపఁబడిన మతము. రామానుజార్యుఁడు బహుదైవపూజను నిర్దాక్షిణ్యముగా ఖండించె; శీలము ముఖ్యముగాని జాతిముఖ్యముగాదని నిరూపించె; ధనుర్దాసాదిశిష్యులను బ్రాహ్మణులకన్న నధికముగా గౌరవించుటచే హీనజాతులను మనము తత్స్వోపదేశముచే మంచిమార్గమునకుఁ దేవలయునుగాని తిరస్కరింపఁగూడదని మనకుమార్గమును జూపెను. స్వదేశోజ్జీవనమునకు ఇంతకన్న శ్లాఘ్యమగుమార్గము కలదా?

శ్లో॥ యథారామస్య చరితం శతకోటిప్రవిస్తరమ్
తథారామానుజస్యేద మవాఙ్మానసగోచరమ్
అలంతర్తుంప్రయత్నేన బాహుభ్యామపిసాగరమ్
యతిరాజస్యచరితం సాంతంవక్తుంనశక్యతే.

అని చెప్పఁబడినట్లు హిందూమతసంస్కర్తలలో నగ్రగణ్యుఁడగు శ్రీభగవద్రామానుజార్యుని చరిత్రము శ్రీరామచంద్రుని చరిత్రమువంటిది. శ్రీరామానుజార్యునిమహిమను సమ

గ్రముగ వర్ణించి యతనిచరిత్రకు సొంతముగ వ్రాయుట
కు వాల్మీకివంటి మహాకవియే కావలయుఅఘునకార్యమును
నావంటివాఁడు ప్రయత్నించుట చేతులతోనీది సముద్రమును
దరింప బ్రయత్నించినట్లు హాస్యాస్పదముగనుండును. ఐనను
ఇటువంటిగ్రంథములు లేకుంటభాషకును మతమునకును
కూడ గొప్పలోపమని తోఁచి దీనిని వ్రాయ దొరకొంటిని.
ఇట్టిగ్రంథములను బ్రోత్సాహపఱచి స్వభాషోజ్జీవనమున కు
ద్యమింతురని ఆంధ్రభాషాభిమానులకందఱకు నావిన్నపము.
వైష్ణవులందఱును దమకు తెలియునివిషయము దీనియందే
ముండునని యుపేక్షింపక యీగ్రంథమును సమగ్రముగఁ
జదివితను ప్రార్థికమగు నుతమును మూఢభ క్తితో బట్టుకొ
నియుండకనిజమతస్థాపకుండగు రామానుజార్యుని యభిప్రా
యములను బరిశీలించి తదనుసారముగ తమమతమును సం
స్కరించికొందురని ప్రార్థించుచున్నాఁడను. ఇతరమతస్థులం
దఱును వైష్ణవమతస్థాపకుండగు రామానుజార్యుని చరిత్ర
మ్ము తమకేలని యుపేక్షింపక సత్యమునందాసక్తిగలవారై
తమమతములమీఁది యాక్షేపములను నిష్పక్షపాతహృదయ
ముతో బరిశీలించి తమబుద్ధికి సకారణమనితోఁచినమార్గ
మును నిర్భయముగా నవలంబింతురని ప్రార్థించుచున్నాఁడను.

S. RANGACHARLU. B.A.

# విషయసూచిక.



విషయములు.

శ్రీ యైనమః.



# శ్రీమద్రామానుజచరిత్రము.



శ్లో॥ యో నిత్య మచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే
అస్మ ద్గురో ర్భగవతోస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥



## శ్రీమద్రామానుజావతారకారణము.

సకలమతములకును సకలశాస్త్రములకును మాతృస్థానమైన ఈభరతఖండమున సుమారు తొమ్మిదిశతాబ్ది

---

* యః=ఎవరు, నిత్యమ్ = ప్రతిదినమును, అచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ వ్యామోహతః=స్వర్ణమువలె స్పృహణీయములైన నారాయణుని పాదకమలములయందలి వ్యామోహముచేత, తదితరాణి = అంతకంటె

ముల క్రిందట మతజ్ఞానాభావముచే మతవిషయములను గుఱించి దురభిప్రాయములును అభిప్రాయభేదములును పెచ్చు పెరిఁగి తన్మూలమునఁ బ్రజలయందేకాక ప్రభువులయందుఁ గూడఁ బరస్పరము వైషమ్య మభివృద్ధి చెంది ఐకమత్య మణుమాత్రమైన లేక అన్యదేశీయు లీదేశముఁ బ్రవేశించి దొమ్మిదోఁపిళ్లచే జనులను బాధించుటకు మాత్రమేకాక ఇక్కడ స్వతంత్ర రాజ్యమును సంస్థాపించుటకుఁ గూడ నవకాశము కలిగియుండెను. ఉత్తరహిందూస్థానమున 'మహమ్మద్ గజినీ దండయాత్రలచే దేవాలయ ధ్వంసమును ద్రవ్యాపహరణమును మతవినాశమును బ్రారంభమై జనులకు నెమ్మది యనునది లేక మహావిపత్సాగరమున' మునిఁగి యుండిరి. మతోపదేష్టలన నెన్నికగన్న బ్రాహ్మణులు

---

వేళు విషయములను, తృణాయ=గడ్డివలె తుచ్ఛములుగ, మేనే=తలంచిరో, అస్మద్గురోః=మన కాచార్యులై, భగవతః=జ్ఞానపూర్తిగలవారై, దయైకసిన్ధోః=కృపాసముద్రులైన, అస్య రామానుజస్య=ఇట్టి రామానుజులయొక్క, చరణౌ=పాదములను, శరణమ్=సంరక్షించు స్థానముగా, ప్రపద్యే=పొందుచున్నాఁడను.

కూడ స్వప్రయోజనపరులై వేదాంతర్గత తత్త్వవిషయముల నితరజాతులవారికి వెల్లడిసేయక క్రమక్రమముగఁదాము కూడ తద్విషయజ్ఞాన విహీనులై తర్కశాస్త్రప్రావీణ్యైక పరాయణులై సత్యమునం దాసక్తిలేక వృథావాదముల యందుఁగాలయాపనము సేయుచుండిరి. మనుమాంధాత్రాది చక్రవర్తిప్రవరుల విజయలక్ష్మిచే నలంకృతంబై అత్రిభృగ్వగస్త్యవ్యాసవాల్మీక్యాది ఋషిసత్తముల తపోగ్నిచే వెలింగి, లోకగురుస్థానమున కర్హమై, వేదవిహితకర్మానుష్ఠానమునకు యోగ్యంబైన యీభరతఖండ మట్టి హీనస్థితి యందుండుటఁ గాంచి, "శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥" అని సాధుసంరక్షణమును దుష్టవినాశనమును ధర్మసంస్థాపనమును జేయుటకుఁ బ్రతియుగమునందునుదానవతరింతునని చెప్పిన సాక్షాచ్ఛ్రీమన్నారాయణుండు, వేదాంతర్భూత తత్త్వవిషయములు తెలిసికొనుటకు శాస్త్రపఠన మవశ్యముకాన సామాన్యజనులకు సుబోధముగ నుండునట్లు వేదసారమని చెప్పఁదగిన భగవద్గీత

లను అర్జునోపదేశవ్యాజంబునఁ 'దానుజనులకుఁ బ్రసాదించి యుండినను వారజ్ఞానాంధకారమును దరింపఁజాల కున్నారే యని కరుణార్ద్రహృదయుఁడై తనశయ్యయగు నాదిశేషునికి భూలోకమున నవతరించి జనులయందు దైవభక్తియు శిష్టాచారముఁ నభివృద్ధిపఱచి వారికి మోక్షమార్గము నుపదేశింప ననుజ్ఞయీయ నాదిశేషువు మహాప్రసాదంబని సంతుష్టాంతరంగుఁడై భూలోకమున నవతరింప నిశ్చితాత్ముఁడై తన్నుఁ బుత్రుగాఁ బడయఁదగిన శిష్టాచారపరు నన్వేషించుచుండెను.

## శ్రీమద్రామానుజావతారఘట్టము.

కాంచీపురము ప్రక్కనుండు శ్రీభూతపురియందు మహాప్రాజ్ఞుఁడు వేదవేదాంగసంపన్నుఁడు సర్వశాస్త్రవిశారదుఁడు సత్యధర్మపరాయణుఁడు సదాచారసమాయుక్తుఁడు 'దేవద్విజగురుపూజాదృఢవ్రతుఁడు హారీతాన్వయసంభూతుఁడు మహాభాగవతోత్తముఁడు కేశవసోమయాజి యను నొకబ్రాహ్మణోత్తముఁడుండెను. తిరుపతియందు శ్రీశైల

పూర్ణుఁడను. నామాంతరముకల తిరుమలనంబి తన తోఁబుట్టువులగు (కాంతిమతి) భూమిపిరాట్టియు పెరియపిరాట్టియు నను నిరువురు కన్యలకుఁ దగిన వరులను వెదకి వెదకి భూమిపిరాట్టిని కేశవసోమయాజికిని పెరియపిరాట్టిని మళల మంగలగ్రామవాసియగు కమలనయనభట్టారకుఁడను నొక బ్రాహ్మణోత్తమునికి నిచ్చి వివాహము సేసెను. పిమ్మటఁ గొంతకాలమునకు కేశవసోమయాజి పుత్త్రులు లేనందున దుఃఖితాత్ముఁడై పుత్త్రార్థము మహాసముద్రస్నానము సేయ నిశ్చయించి భార్యాసహితుఁడై మొదట కైరవిణికి (తిరువల్లికేణికి) వచ్చి అచ్చట స్నానముసేసి శ్రీపార్థసారథి నతి భక్తితో ధ్యానింప స్వామి అతనికి స్వప్నమునఁ బ్రత్యక్షమై నీకుఁబుత్త్రదానము సేసితినని చెప్పి యంతర్హితుఁడాయెను. సోమయాజి మేల్కాంచి ఆనందసాగరమగ్నుఁడై ఇతరసాగర స్నాన మనవశ్యమని మరలి భూతపురికి బయలుదేరి పోయెను. పిమ్మట కొంకవారములోనే భూమిపిరాట్టి గర్భవతియై నవమాసపూర్తికాఁగా ఆమెగర్భమునందు,

శ్లో॥ కల్యబ్దే దివ్యకున్మే బుధజనవిదితే వత్సరే పిఙ్గళాఖ్యే
చైత్రే మాసే గతేషు ద్వియుతదశదినే ష్వేధమానే హిమాంశౌ
పక్షే మ్యార్ద్రా సమేతే సురగురుదివసే కర్కటాఖ్యే చ లగ్నే
శ్రీమద్రామానుజార్య స్సమజని నిగమాన్తార్థసంరక్షణార్థమ్.

కలియుగము 4118వది, పింగళనామ సంవత్సరము వసంత ఋతువు చైత్రమాసము శుక్లపక్షము పంచమి గురువారము ఆర్ద్రానక్షత్రము కర్కటలగ్నమునందు దేవకియొక్క గర్భమున శ్రీకృష్ణుఁడును కౌసల్యగర్భమున శ్రీరామచంద్రుఁడును ఏప్రకార మవతరించి తమజననీజనకులకు నేత్రోత్సవము కావించిరో అట్లే మహాబలుఁడగు నాదిశేషు వవతరించి తనజననీ జనకులకు మాత్రమే కాక చూచువారి కందఱకుఁ గనుల పండువు కావించెను. బాలభాస్కరునివలె తేజోరాశియగు పుత్త్రుని జూచి భూమిపిరాట్టి ఆనందమగ్నురాలాయెను. దివ్యలక్షణసమన్వితుఁడును అతిసుందరుఁడునగు పుత్త్రునిఁ జూచి సోమయాజి బ్రాహ్మణులకు ధనధాన్యములు విశేషముగ దానము చేసెను. పిమ్మట తనకు మేనల్లుఁడు జనించె నని విని తిరుమలనంబి అతిత్వరితముగ భూతపురి కేతెంచి

దివ్యలక్షణలక్షితుఁడును అతిసుందరుఁడునగు బాలుని జూచి సంతుష్టాంతరంగుఁడై పండ్రెండవరోజున నా బాలునికి నామకర్మము యథావిధిగా జరిపి రామానుజుఁడని పేరు పెట్టెను. దినదినప్రవర్ధమానుఁడగు నా బాలుని జూచు వారందఱు ఇతఁడు శేషుఁడో లేక సైన్యనాథుఁడో అని యుత్ప్రేక్షింప సాఁగిరి. సోమయాజి పుత్త్రునికి వరుసగా అన్నప్రాశన చౌలోపనయనాది వేదవిహితకర్మములు యథాక్రమముగ నిర్వర్తించి అంత పదునాఱేండ్ల ప్రాయము రాఁగా షోడశకళాపరిపూర్ణుఁడగు చంద్రుమాడ్కి కనులపండువు కావించుచున్న పుత్త్రునికి వివాహకర్మము కూడ జరిపి కృతార్థుఁడై పరలోకగతుఁడాయెను. పితృవియోగదుఃఖమును జ్ఞానబలముచే ధిక్కరించి పితృకర్మముల నన్నిటిని యథాక్రమముగ నాచరించి పిమ్మట శాస్త్రపఠనాభిలాషియై కాంచీపురమున యాదవప్రకాశకుఁడను పండితోత్తముఁడు యతీశ్వరుఁడున్నాఁడని విని యచ్చటికి సకుటుంబముగా బయలుదేరి పోయి యాదవునియొద్ద ప్రతిదినమును శాస్త్రము నభ్యసించుచుండెను.

శ్రీరామానుజార్యుఁడు బ్రహ్మరాక్షసును బాఱఁద్రోలుట.

ఆపట్టణపు రాజకూఁతురు పిశాచగ్రస్తయై అనేక మాంత్రికులు వచ్చి మంత్రప్రయోగము సేసియుఁ దదుచ్చాటనముసేయ లేనందున రాజు యాదవప్రకాశకుని రమ్మని ప్రార్థింప నతఁడు శిష్యపరివృతుఁడై పోయి పిశాచభయంకరంబగు తనమంత్రము నుచ్చరింప బ్రహ్మరక్షస్సు ప్రళయకాలమేఘగర్జనమువంటి భయంకరంబగు ధ్వని చేసి గంభీరవాక్కుతో యాదవప్రకాశకునితో నిట్లు చెప్పెను, ఓయ్యాదవ, మదుచ్చాటనము మనీమంత్రములవలన సాధ్యపడదు. నేను పూర్వ మొక బ్రాహ్మణోత్తమునిగ నుండి యజ్ఞము సేయుటయందు మంత్రక్రియాలోపములవలనని బ్రహ్మరక్షస్సు జన్మము నొందితిని. నీపూర్వజన్మ వృత్తాంతమును జెప్పెదను వినుము. మధురాంతకమను గ్రామముపశ్చిమదిగ్భాగంబున నొకసరస్సునొద్ద వేదవేదాంగపారగుఁడు ఒకవిష్ణుభక్తుఁడు అన్నమువండి దేవతార్చనము సేసి పిమ్మట తాను భుజించి మిగిలినయన్నమును కుండతో నొకపాద సమీప

మున శాఖవేయ నీవు ఆపాదసమీపమున నొకయుడుమవై యుండి యాయన్నమును భుజించితివి. భాగవతోచ్ఛిష్ట భోజనపుణ్యపరిపాకముచే నీవు బ్రాహ్మణజాతియందుఁ బుట్టితివి. "భక్తవత్సలుఁడగు రామానుజుని పాదపద్మములనాశ్రయించి మోక్షమును బొందుము. ఆరామానుజార్యుఁడు తన పాదముతో నన్ను స్పృశించి నాకు శ్రీపాదతీర్థ మిచ్చి నన్ను పొమ్మన్న నేను సులభముగఁ బోవుదునుగాని నన్నుఁ బాలుఁడోల మణిమంత్రములవలనఁ గాదు." మేఘగర్జనమువలె గంభీరమును స్ఫుటమునైన వాక్యతో బ్రహ్మరక్షస్సు చెప్పినమాటలువిని యాదవుఁడు మనస్సున లజ్జాభయంబులు పెనఁగొన నిరుత్తరుఁడై యూరకుండెను. ఆబ్రహ్మరక్షస్సు మాటలు విని రాజు రామానుజార్యుని యొద్దకు వచ్చి కరంబులు మోడ్చి వినయవినమితోత్తమాంగుఁడై యిట్లు విజ్ఞాపించెను, "స్వామీ, మహానుభావా, మీమాహాత్మ్యము నే నెఱుఁగను, బ్రహ్మరక్షస్సువలనఁ దెలిసికొంటిని. నన్నును నాకూఁతును సంరక్షింపుఁడు" కరుణార్ద్రచిత్తుఁడగు రామానుజార్యుఁడంతట బ్రహ్మరక్షస్సు నొద్దకు వచ్చి దానిమీఁద

తనపాదముంచి దానికి శ్రీపాదతీర్థము నిచ్చి "గచ్ఛ, గచ్ఛ" అని చెప్పఁగానే బ్రహ్మరక్షస్సు నిర్దోషియై దివ్యదేహమును ధరించి అప్సరసలతోఁగూడుకొని విమానము నెక్కి బయలు దేరిపోయెను. అంత రాహునిర్ముక్తుఁడగు చంద్రునివలెఁ దేజరిల్లుచున్న కూతుని జూచి రాజుపరమానందభరితుఁడై రామానుజార్యునికి కనకాభిషేకము సేసెను; యాదవ ప్రకాశకుని గూడ సత్కరించెను. రామానుజార్యుఁడు రాజ దత్తసకలధనమును యాదవుని కిచ్చివేసినను తనకుఁగలిగిన యవమానమును సహింపఁజాలక యాదవుఁడు ఆయవమాన మునకు రామానుజార్యుఁడు కారణభూతుఁడని అతని విష యమై దీర్ఘమత్సరము వహించి యుండెను.

## సత్యంజ్ఞానమిత్యాద్యుపనిషద్వాక్యార్థ విచారఘట్టము.

అప్పుడు రామానుజార్యుని పినతల్లి పెరియపిరాట్టి కొమారుఁడు గోవిందమిశ్రుఁడు తనయన్న కాంచీపురమున యాదవప్రకాశకునియొద్ద వేదాంతశాస్త్రము నభ్యసించు చున్నాఁడని విని భాతృదర్శనాభిలాషియై తల్లియనుజ్ఞ వడసి

కంచికి వచ్చి యచ్చటనే అన్నతో యాదవునియొద్ద శాస్త్ర పఠనము సేయ నారంభించెను. అంతలక్ష్మణదేశికుండు ప్రతి పక్షవిక్షేపణదక్షుంబగు స్వపక్షంబునకుఁ బూర్వపక్షంబుగా నయ్యాదవప్రకాశకుని కడ నద్వైతభాష్యంబాకర్ణించుచుండ నొకనాఁడతండు, "సత్యంజ్ఞానమనంతం పరబ్రహ్మ యో వేదనిహితం గుహాయాం సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సబ్రహ్మణావిపశ్చితేతి" * అను ఉపనిషద్వాక్యంబు "ఇతర

---

* అద్వైతులు బ్రహ్మము సత్యమయమనియు జ్ఞానమయమనియు నిర్గుణ మనియు వాదింతురు. పరబ్రహ్మము నిర్గుణమైనఁ ద్రిగుణాత్మకమగు నీ ప్రపంచమునకు కలుగుట కవకాశముండదు. ఐన నద్వైతులు ఈ ప్రపంచ మంతయు మాయాజనితము మిథ్యయని చెప్పుదురు. ప్రపంచము మాయా జనితమైన • మాయా మోహితుఁ డెవఁడు? నిర్గుణబ్రహ్మమేకటియే సత్యము తక్కినదంతయు మిథ్యకదా? కాన నిర్గుణబ్రహ్మమే మాయా మోహితమని చెప్పవలసినచ్చును. కాఁబట్టి మాయావాదము సాధ్యముకాదు అందుచేతనే అద్వైతియగు యాదవప్రకాశకుని వాదమును లక్ష్మణదేశి కుఁడు ఖండించె. యాదవప్రకాశకుఁ డద్వైతికావున ఉపనిషద్వాక్యము నందలి సత్యజ్ఞానానంతశబ్దములు బ్రహ్మమునకు విశేషణములైనను అట్లర్థము చెప్పుట నిర్గుణబ్రహ్మవాదమునకు సరిపడదు కావున బ్రహ్మముసత్య

వ్యావృత్తిపరంబు, ఆవ్యావృత్తియు నశేష విశేషప్రత్యనీక నిర్విశేషచిన్మాత్ర బ్రహ్మస్వరూపపరంబై • యొప్పుంగాని వేఱొకటిగాఁ జెప్పంబడ" దని విని లక్ష్మణార్యుఁడు, "సార్వభౌముండైన రాజునకు మణిమౌక్తికదామాభిరామంబై శరదిందుసుందరంబగు శతశలాకచ్ఛత్రంబుమాడ్కి ననన్యసాధారణంబైన జగజ్జన్మాదికారణత్వలక్షణంబుచే నుపలక్షితంబగు పరబ్రహ్మంబునందు సత్యపదంబు 'నిరుపాధిక సత్తాయోగిత్వంబును జ్ఞానపదంబు అసంకుచితజ్ఞానాశ్రయత్వంబును అనంతపదంబు త్రివిధపరిచ్ఛేదరాహిత్యంబును జెప్పుంగాని

---

మయమనియు జ్ఞానమయమనియు నర్థము సెప్పెను. బ్రహ్మము జ్ఞానమయమని చెప్పుట నాస్తికవాదమగును. ఏలయన జ్ఞానము ఆశ్రయము లేక స్వతంత్రముగఁ బ్రకాశింపఁజాలదు. జ్ఞాని యొకఁడుండినఁగాని జ్ఞానముండ నేరదు. పరబ్రహ్మము సర్వజ్ఞుఁడని చెప్పవచ్చునుగాని జ్ఞానమయమని చెప్పిన నిరాశ్రయముగ జ్ఞానము ప్రకాశింపఁజాలదు కావున లక్ష్మణదేశికుఁడు యాదవప్రకాశకుని వాదము ఖండించి పరబ్రహ్మము సత్యపదముచే నెల్లప్పుడు నిరుపాధికముగనుండునదనియు జ్ఞానపదముచే సర్వజ్ఞత్వాశ్రయంబనియు, అనంతపదంబుచే, త్రివిధపరిచ్ఛేదరహితంబనియు నయ్యుపనిషద్వాక్యార్థంబని సంస్థాపించె.

కల్యాణగుణయోగార్థకత్వం బహువాక్యంబున కర్ణితమంబై యుండ నిట్లు వ్యావృత్తి యత్యార్థాంబుగా నుదాహరించుట యన్యాయంబు" అనిన నయ్యేకదండి రోషారుణిత నేత్రుండై హుంకరించి, "హేదుర్మతే, నీగురువనైన నాకు నీవునేర్పువాఁడవా? ఛీ! తత్క్షణము నాగృహముఁ వీడిచి పొమ్ము" అని సాధుసత్తముఁడగు లక్ష్మణార్యుని విషయమై దౌర్జన్యము చూపెను. లక్ష్మణార్యుఁడును మాఱు పలుకకఁ పోయి స్వగృహము సేరెను.

లక్ష్మణార్యునివిషయము దీర్ఘమత్సరము వహించిన యాదవుఁడంత నొక్కనాఁడు ఏకాంతంబునఁ దనశిష్యులను బిలిచి వారితో, "నేను బ్రాహ్మణులందఱిలోఁ బ్రసిద్ధపండితుఁడనైన విషయము మీకుఁదెలియును గదా! నేనువాదసభలయం దెప్పుడును అవమానముపొంది యెఱుఁగను. సర్వవేదవేదాంతపారగులును నన్నుబహూకరింతురు. అట్టి నేను లక్ష్మణార్యునిముందర బ్రహ్మరక్షస్సుచే నవమానింపఁబడితిని. నావలన సర్వగ్రంథముల నభ్యసించియు లక్ష్మ

ణాఁడు నేను చెప్పునర్థ మపార్థమని దూషింపఁ ధొడఁగె. అతఁ డద్వైతమతఖండనముకొఱకుఁ బుట్టినవాఁడు. కాన నాకు సహజశత్రువు. కాఁబట్టి అతని నెట్లైన వధించుట కర్తవ్యము; దీని కొకయుపాయము కలదు. మనమతనితో సఖ్యముచేసి యతనిని గంగాయాత్రామిషంబునఁ గూడఁబిలుచుకొనిపోయి మణికర్ణికాఘట్టమునఁ ద్రోసివైచి యచ్చట స్నానముచేసి వచ్చిన మనకు బ్రహ్మహత్యాదోషము సంభవింపదు." అని మందలించి వారినొప్పించి లక్ష్మణార్యుని రప్పించి వానితో, "మహాప్రాజ్ఞుఁడవగు రామానుజా, నా శిష్యులందఱిలో నీవు నాకుమిక్కిలి ప్రియుఁడవు. నీవు నిశ్చయముగా లోకప్రసిద్ధుఁడవగుదువు. నావలన నీవు విద్యాపూర్తి చేసికొనుము. నీపరోక్షమున నేనహర్నిశము తపించుచుంటిని" అని విషమిశ్రామృతోపమానముల నీవాక్యములఁ జెప్పి రామానుజార్యుని దిరుగఁ దనయొద్దవచ్చి శాస్త్రపఠనము సేయునట్లు ప్రేరేపించెను.

## యాదవుఁడు రామానుజు నొంటరిగ వింధ్యప్రాంతకాంతారమున విడిచి చనుట.

అంతఁ గొన్ని దినముల కందఱు గంగాస్నానార్థమై బయలుదేరిరి. మార్గమున గోవిందమిశ్రుఁడు యాదవుని వంచకత్వమును లక్ష్మణార్యునికిఁ దెలియఁ బలుకు అవకాశమునకై నిరీక్షించుచుండెను. కడపట వింధ్య పర్వతప్రాంత కాంతారమునందుఁ బోవునప్పుడు లక్ష్మణార్య గోవిందమిశ్రులను వెనుకవిడిచి తక్కినవారు కొంత దూరము ముందునడిచి పోఁగా భ్రాతృవత్సలుఁడు గోవింద మిశ్రుఁడు అన్నతో, "గంగాస్నానకైతవమున యాదవుఁడు నిన్నుఁ జంపఁ జూచుచున్నాఁడు. కాన నీవు మరలిపొమ్ము" అనిచెప్పి తాను త్వరితముగఁ బోయి తక్కినవారితోఁ జేరెను. అంత యాదవప్రకాశకుఁడు లక్ష్మణార్యుఁ డెక్కడ అతని నొంటిగా విడిచి నీవుమాత్రము రాఁదగునా?" అని గోవింద మిశ్రునడుగఁగా నతఁడు, "లక్ష్మణార్యుఁడు ముందే వచ్చెనే" అనిమాఱువలికెను. అంత వింధ్యగహనక్రూరసత్త్వముల కాహారమగును లక్ష్మణార్యుఁడని మనంబున పరమానందము

నొందిన వాఁడయ్యును పైకి అతిభయదుఃఖముల నభినయిం చుచు శిష్యులను లక్ష్మణార్యుని వెదకుటకు నల్దిక్కులఁ బంపెను. తమగురువు నాశయమెఱిఁగిన వారుకాన శిష్యులు వెదకుట నభినయించి "లక్ష్మణార్యు నెక్కడను గానము" అనుచు మరలివచ్చిరి. అంత తనయుద్దేశ మప్రయత్న పూర్వకముగా నెఱవేఱుటకు భగవంతుని ధ్యానించుచు యాదవప్రకాశకుఁడు శిష్యులతోఁ గూడ గంగాయాత్రకు వెడలెను.

లక్ష్మణదేశికుఁడు వరదుననుగ్రహంబున మరలఁ
గాంచీపురంబు సేరుట.

గోవిందమిశ్రుఁడుపోయినవెంటనే రామానుజార్యుఁడు ఒకివృక్షముక్రిందఁ గూర్చుండి భగవంతుని ధ్యానించి సూర్యాస్తమయము కాఁబోవుసమయమున లేచి ప్రక్కన నొకకొలనియందు సంధ్యావందనము చేసి కాంచీపురమునకుఁ బోవుదారి తెలిసినవారెవరైన వత్తురో యని ఎదురు చూచు చుండెను. అప్పుడు కరిగిరివరదుఁడు భార్యాయుక్తుఁడై వ్యాధవేషమును ధరించి యామార్గమునవచ్చి యారాత్రి

రామానుజాచార్యునికిఁ దోడేర్పడెను. రాత్రి వ్యాధపత్ని, "పిపాసాబాధితనైతిని. ఇక్కడదగ్గఱజలముదొరకదా?" యని భర్త నడుగఁగా నతఁడు దగ్గఱజలమున్నదికాని గాఢాంధకారమున నచ్చటికిఁబోవుటసాధ్యముకాదని బదులుచెప్పెను. రామానుజాచార్యుఁడు కరుణార్ద్రచిత్తుఁడై తనకుపకారముసేసిన వ్యాధదంపతులకుఁ బ్రత్యుపకారము సేయ నిశ్చయించి ప్రాతఃకాలము కాఁగానే తాను జలముతెచ్చెదనని చెప్పి యూరకె నూరార్చెను. ఇంతలోఁ బ్రాతఃకాలము కాఁగా రామానుజార్యుఁడు ప్రక్కనుండిన కూపమున దిగి మూఁడు సారులు తనదోసిటిలో జలముఁ దెచ్చియిచ్చి నాల్గవసారి జలమెత్తుకొని పైకి వచ్చునంతలో వ్యాధదంపతు లంతర్ధానము నొంద అప్పుడు సాక్షాద్విష్ణువు లక్ష్మితోఁగూడ వచ్చెనని తెలిసికొని పరమానందభరితుఁడై కొంతదూరము పోయి యొకపట్టణము కాంచి యక్కడి వారి నాపట్టణము పేరడిగి కాంచీపురమని తెలిసికొని మనంబున సంభ్రమాశ్చర్యంబులు పెనఁగొన స్వగృహము సేరి తల్లికి. యాదవప్రకాశకుని వంచకత్వమును కరిగిరివరదునిరక్షకత్వము నంత

యు తెలియఁజెప్ప నామె శబర్యంశమునఁబుట్టి కాంచీపూర్ణుఁడను గజేంద్రదాసుఁడనునన్నామాంతరములు గల తిరుక్కచ్చి నంబి యొద్దికిఁబంప నతని యొద్దికిఁబోయి యతనికి యావద్విషయమును దేటపఱిచెను. శూద్రకులమునఁ బుట్టిన వాఁడయ్యు పరమభాగవతోత్తముఁడగు తిరుక్కచ్చినంబి లక్ష్మణార్యునితో, "నీవిషయమయి వాత్సల్యము చూపి నందున కరిగిరివరదునికి నీవాకకైంకర్యముసేయుము. ఏకూపమునుండి నీవు ముమ్మాఱులు వ్యాధవేషధారియగు వరదునికి జలము తెచ్చియిచ్చితివో ఆశాలకూపమునుండియే ప్రతిదినమును వరదుని అభిషేకమునకుఁగాను తీర్థము తెచ్చి యిమ్ము" అనిబోధింప లక్ష్మణార్యుఁడు మహాప్రసాదమని యావిషయమును జననికిఁ దెలియఁబఱిచి యప్పటినుండి ప్రతిదినము శాలకూపమునుండి జలము తెచ్చుచు, "నాగాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే। వరదా యాప్రమేయాయ గోవిందాయ మహాత్మనే" అని ధ్యానించుచు కరిగిరి వరదునికి మజ్జనకైంకర్యం బాచరించుచుండెను.

### గోవిందమిశ్రుఁడు శైవమతము నవలంబించుట.

యాదవప్రకాశకుఁడు శిష్యపరివృతుఁడై ప్రయాగాంతికంబునఁ ద్రివేణియందుస్నానంబు సేయ నపుడు లింగ మొక్కటివచ్చి కదిసిగోవిందుని కరతలమునఁబడినఁ గన్గొని యతఁడు దానిని గురువునకుఁ జూప నతఁడు గోవిందునితో, "వత్సా, ఇదిశివలింగము. అర్చచేసిన నీకు క్షేమమగును" అనిపల్కెను. అంత గోవిందసూరి యట్లేచేయుచుఁ దనస్వగ్రామమున నాలింగమును బ్రతిష్ఠించి మరలివచ్చెదనని యాదవునీవీడ్కొని మళలమంగలగ్రామమునకుఁ బోయి యచ్చట నొక దేవాలయమ్మున నాలింగమును శాస్త్రోక్తప్రకారముగ సంస్థాపించి యర్చింప కాళహస్తీశ్వరుఁ డతనికి స్వప్నమునఁ గనఁబడి, "నేను కాళహస్తీశ్వరుఁడ నన్నుఁగనుము. అవశ్యమువచ్చి మాకడనుండుము" అనిపల్కి యంతర్ధానము నొందెను. తదనంతరంబు ఆకాళహస్తీశ్వరుఁడు స్వమందిరాధికారపురుషునకు స్వప్నంబునఁ దన్నుంబొడసూపి యిట్లనియె, "వత్సా, గోవిందమిశ్రుండను విప్రకుమారుం డొకండు ముందు త్రివేణీస్నానంబు సేసి వారణాసీనగరంబు

నకుం జనుదెంచి మఱికొన్నిదినంబు లచట వసియించి మఱియొక దినం బుదయం బున స్నాననిమిత్తం బా గంగానదికిం జని నిమజ్జనంబు సేయుచుండ నక్కడ నా గంగాప్రవాహంబున నుద్భవించిన పరిమాణంబైన యొక శివలింగంబు తనకు దొరకిన నానందించి దానిం గొని తీరంబు జేరి యిది శివానుగ్రహం బని మిక్కిలి సంతసించుచుండ నమ్మహాలింగం బా సమయంబున నుళ్ళంగైకొండనార్ అని ద్రవిడభాషా భూషితంబగు నామవిశేషంబు తనకు నతండిప్పు డీశ్వరుండు సెప్పెను. అందువలన నా నామంబు బహుమానపూర్వకంబుగా నిచటికి దోడ్కొని రమ్ము” అనియాజ్ఞాపించి కాళహస్తీశ్వరుం డంతర్హితుం డయ్యె. అంతట నద్దేవాలయాధికారి మేల్కాంచి మిగుల నానందించి నిజపరివారంబుతో నమ్మంగళమంగలగ్రామంబున కరుగుదెంచి అమ్మేధావినిం బొడగాంచి సముచితసత్కా రంబుల నర్పించి అతనిందోడ్కొని వచ్చి శివశాసనంబుచేఁ దదీయ ధన కనకరత్న వాహనాంబరాభరణాది మండిత భాం డాగార ముద్రికలన్నియు నతని యధీనంబులుగాఁ జేయ నతం డద్దేవాలయంబునఁ దదీయసర్వకార్యనిర్వాహకుండై యుండె.

గోవిందమిశ్రుని తిరుమలనంబి మరల వైష్ణవమతమునకుం దెచ్చుట.

తన మేనల్లుఁడట్లు శైవమత మవలంబించి కాళహస్తీశుని కడనున్న వాఁడని విని తిరుమలనంబి వచ్చి శైవపూరుష శత సంవృతు గోవిందసూరిని దవ్వులం జూచి చూచి యాతఁడు తనతోడ భాషింపఁ దలఁపక తన్నుపేక్షింప నాతని కటాక్షించి "సర్వశేషి సంకల్ప మిట్టుండ చేతనుండు సేయఁగలదేమి" యని మదిం జింతిలుడిగి శేషాద్రికరిగె. అంతనూరకుండక మఱియొకనాఁడు కాళహస్తికేతెంచి గోవిందసూరి యనేక శైవజనపరివార పరివృతుండై యేతెంచుచుండ నతని కనోన్మీల *శ్లో॥ కశ్శ్రీః శ్రియః పరమసత్త్వసమాశ్రయః కః కః పుండరీకనయనః పురుషోత్తమః కః। కస్యాయుతాయుతశతైకకళాంశకాంశే విశ్వం విచిత్రచిదచిత్ప్రవిభాగవృత్తమ్॥ అను భగవద్యామునముని ప్రణీత స్తోత్రరాజ

* శ్రియః = సంపదధిష్ఠానదేవతయగు లక్ష్మీదేవికిని, లేక. అందఱిచే నాశ్రయింపఁబడువారికిని: శ్రీ = సంపదయైనవాఁడు, లేక, ఆశ్రయింపఁబడు వాఁడు; కః = ఎవఁడు: పరమసత్త్వసమాశ్రయః = సత్త్వమనఁదును సత్త్వమగు పరమసత్త్వగుణమునకు ఆశ్రయభూతుఁడు, కః = ఎవఁడు,

భ్రాజమానంబగు శ్లోకం బొక్కటి లిఖించి యమ్మార్గమధ్యంబున వైచిన గోవిందసూరియు దానిని గ్రహించి పఠించి దరహాసితభాసుర ముఖారవిందుండై యగ్గురువరేణ్యునింజూచి "సాధుసత్తమా! ఈశ్లోకంబు మీకు పరమదైవతంబగు నారాయణునకు సర్వోత్తమత్వ ప్రతిపాదకంబు కావున మీ యెడ నుండవలయు" అని చెప్పి తత్సన్నిధానవర్తియగు శ్రీవైష్ణవున కొసంగి చనియె. తిరుమలనంబియు శేషాద్రి కరిగి అంతటితో విరమింపక శ్రీహరిశరణుపొంది

---

పుండరీకనయనః=కమలములవంటి కన్నులుగలవాఁడు. ('కప్యాసంపుండరీకాక్ష' యని శ్రుతివాక్యము) కః = ఎవఁడు, పురుషోత్తమః=పురుష శ్రేష్ఠుఁడు, లేక (ఈప్రపంచమంతయు పురుషప్రధానాత్మకమని సాంఖ్యమతము. పురుషుఁడనఁగా జీవుఁడు, కాఁబట్టి) పరమాత్ముఁడు; కః= ఎవఁడు; విశ్వం=ప్రపంచము; కస్య=ఎవనియొక్క; అయుతాయుత శతైకకళాంశుకాంశైః = నూఱుపదివేలు పదివేలకళలలో నొకదాని యొక్క యంశములచేత, విచిత్రవిధచిత్ప్రవిభాగవృత్తమ్= విచిత్రమగు పురుషప్రధానవిభజనచే వర్తిల్లుచున్నది, (అట్టి పరాత్పరుని నమస్కరించుచున్నాను).

తదనుగ్రహము చెంది మరలఁగాళహస్తికి వచ్చి సర్వజనమనో
నయనానంద సంధాయకంబగు బిల్వబృందంబు గాంచి
యాగోవిందమిశ్రుండు ఇచటికి స్వదేవతారాధనార్థంబు
బిల్వపల్లవసంగ్రహంబు సలుప రాఁగలఁడని యూహించి
యందొక తరుమూలంబున నాసీనుండై తిరువాయ్మొళి
యను రెండవపది కర్థం బాశ్రితులకుం బ్రసాదించుచున్న
సమయంబున భస్మోద్ధూళిత సర్వాంగుండును భూతిరుద్రాక్ష
మాలాలంకృతుండునునైన ఉళ్లంకై కొణర్న్తనైనా రా
గ్రదేశంబున కేతెంచి యమ్మహాదేశికునకుఁ బ్రదక్షిణంబుగాఁ
జని యబ్బిల్వవృక్షం బారోహించి బిల్వదళగ్రహణంబు
సలుపుచుండఁ "తేవురుప్పొరుళుంబడక్క" యనుపాశురంబు
ప్రస్తుతంబైన దేవాది సమస్తవస్తువిస్తారవిధానార్థంబుగా
స్వనాభికమలంబునం జతుర్ముఖునిఁ బుట్టించిన శ్రీమన్నారాయ
ణాభిధానుండగు దేవాదిదేవునకుం గాక యితరదేవతలకుఁ
బుష్పంబులుం బూజయుం దగునే యని తదర్థం బగ్గురుండు
సెప్ప విని తగదు తగదని రుద్రాక్షవలయంబులన్నియుఁ

ద్రెంచి వైచియు బిల్వదళపూరితంబులగు పుటికలం జించి వైచియు నిజోత్తరీయంబుచే నొడలం బూసిన భసితంబు దుడిచి వైచియు నబ్బిల్వశాఖాగ్రమునుండి గుభాలున భూమికుఱికి తిరుమలనంబి పాదకమలములయం దార్త ప్రపన్నుఁడై పడియున్న యగ్గోవిందమిశ్రు నుపేక్షించి యతఁడు జగద్రక్షకుండగు పుండరీకాక్షుం దలంచుచు సహోదరయంబునఁ జనుచుండ కామధేనువునను సరించి చను వత్సంబుమాడ్కి నమ్మహాత్ముని వెనువెంటఁ జని యతని పాదములాశ్రయించిన నతఁ డలరి యతని కోరిన హితములఁ గావించి యతనితోడ నంజనాద్రీశుఁగని మ్రొక్కి యభి నుతించి యతని యానతిఁ దమయింటికరిగె. కాళహస్తిలో శైవులు చింతపడుచుండ స్వప్నములయందు వారితో కాళహస్తీశ్వరుఁడు, "నేను హరుఁడను. గోవిందసూరి ఖగరాజు. అతని మతిశుద్ధినరయ నిట్లొనర్చితి మీ కేలవగపు" అని చెప్పి వారికి దుఃఖోపశమనము గావించెను.

## యామునార్యుఁడు లక్ష్మణదేశికుఁ జూడఁ గాంచీపురంబునకు వచ్చుట.

అనంతరము శ్రీరంగపట్టణవాసి వేదవేదాంతవిశారదుఁడు పంచసంస్కారసంపన్నుఁడు పరవాదిభయంకరుఁడు సింహాసనాంశసంభూతుఁడు శీలాదిగుణసంయుతుఁడు శరణాగతరక్షకుఁడు శ్రీమద్వైష్ణవసిద్ధాంతపాలకుఁడు యామునార్యుఁడను యతీంద్రుఁ డొకనాఁడు శఠకోపదివ్యప్రబంధమును బఠించి యంత తనశిష్యులను బిలిచి, "మీరు దేశదేశము వెదకి సర్వలక్షణశోభితుఁడును విష్ణుభక్తిసమాయుక్తుఁడును శమాదిగుణసంయుతుఁడును సదాచారసంపన్నుఁడును సజ్జనప్రతిపూజకుఁడు నగు మానవుఁ డెక్కడ నున్నాఁడో చూచి నాకుఁ దెలియఁ జెప్పుఁడు" అని యాజ్ఞాపింప వారు సకలదేశములు వెదకి యామునార్యోక్తలక్షణలక్షితుఁడగు వానిఁ గానక కడపట కాంచీపురమున రామానుజార్యుని జూచి యతనిఁగా నిశ్చయించి యావిషయము తమగురువునకు నివేదించిరి. అంత లక్ష్మణార్యుఁడు యాదవప్రకాశకునియొద్ద నద్వైతభాష్యం బాకర్ణించుచుఁ జేసిన యాక్షేపములును

తన్మూలమున యాదవుఁడతనివిషయమున దీర్ఘమత్సరము వహించి యతనికపకృతులు సేయనవి భగవదనుగ్రహంబున నిరర్థకంబులగుటయు విని యామునాచార్యుండు సన్నిధానవర్తులగు నార్యుల నుద్దేశించి, *శ్లో॥ అసత్తపవాత్రహిసమ్భవన్తిహసన్తి కాయామివహావ్యవాహాః। అత్రైవసన్త యది సమ్భవన్తి హ్యాత్రైవలాభ స్సరసీరుహాణామ్॥ అని యానతిచ్చి యమ్మహానుభావు నిరీక్షింప నుత్సహించి యనేక శ్రీవైష్ణవబృందంబుతో శ్రీరంగధామంబువిడిచి యతిరయంబునం జనుదెంచి.

†శ్లో॥ పురీణా మపి సర్వాసాం శ్రేష్ఠాపాపహరాగాహినా। నామ్నా కాంచీతి విఖ్యాతా పురీ పుణ్యవివర్ధినీ॥

---

* ఈవిభూతియందు దుర్మార్గులు కుంపటియందలి అగ్నికణంబుల వలె అనంతములుగ నున్నారు. కాఁబట్టి సత్పురుషులు కలుగుట కుంపటి యందు కమలములుపుట్టుటవలె దుస్తరముగనున్నది.

† సర్వాసాంపురీణామపి = అన్ని పట్టణములలోను, శ్రేష్ఠామ్ = సర్వోత్కృష్టమైనదియు, పాపహరా = పాపములను బోఁగొట్టునదియు, పుణ్యవివర్ధినీ = పుణ్యములను వృద్ధిసేయునదియునగు, సాపురీ =

అనఁదగిన మాహాత్మ్యంబుకల కాంచీపురంబు కాంచి కరిగిరి ప్రాసాదంబున శ్రీపెరుందేవిత్తాయారుతోడఁ గూడియున్న వరదుని భజించి మఁగిడి ప్రదక్షిణంబు సేయుచు కరిగిరికి వాయువ్యప్రదేశంబున విలసితంబగు వల్మీకంబునందుఁగల శ్రీమదనంతునకు జోహారువు చేసి యచ్చోట నిజాశ్రితులతో నుండు సమయంబున యాదవప్రకాశకుఁడు శిష్యులతో భగవత్సేవయొనర్చి ప్రదక్షిణంబుగా వచ్చుచుండం జూచి వీరిలో నిలయాళ్వారులు (లక్ష్మణార్యుఁడు) ఎవరని నిజ శిష్యుఁడగు తిరుక్కచ్చినంబి నడుగ నగ్గజేంద్రదాసుఁడును నిజగురుని నుద్దేశించి బాలభాస్కరప్రభాభాసమానదివ్యమంగళ విగ్రహుండును దత్యోన్మీలిత పుండరీకదళాయతాక్షుండును తప్తతపనీయకణికోపమాన శ్రీచూర్ణరేఖా సమంచితాంతరాళ సుధాధవళమృత్స్నాంచిత ఛిద్రోర్ధ్వపుండ్ర సముల్లసల్ల లాటాదిద్వాదశాంగుండును తులసీనలినాక్షమాలికాలంకృత విశాలపీవరోరస్స్థలుండునునై తేజోరాశియై చూపట్టుచున్న

---

ఆపట్టణము, నామ్నా కాంచీతి విఖ్యాతా = కాంచీపట్టణమను పేరుతోఁ ప్రసిద్ధినొందినది.

వాఁడిలయాళ్వారు" అని కేలంజూపఁజూచి యగ్గురువరుం డమందానందంబుడెందంబున గ్రమ్ముకొన నాలక్ష్మణముని యెడల విశేషకటాక్షం బొనర్చి *శ్లో॥ యస్య ప్రసాదకలయా బధిర శ్శృణోతి పఙ్గుః ప్రధావతి జవేన చ వక్తి మూకః। అన్ధః ప్రపశ్యతి సుతం లభతే చ వన్ధ్యా తం దేవ దేవ వరదం శరణం గతోస్మి॥ అని శ్రీకరిగిరివరదునుద్దేశించి యిఁకమీఁద నీలక్ష్మణార్యుఁడు దర్శనప్రవర్తకుండగునట్లనుగ్రహింపుమని ప్రపత్తిఁజేసి యాలక్ష్మణాచార్యునకు హితోపదేశం బొనర్ప నవసరంబు కాకుండుటం జేసి తనవెనువెంట నేతెంచుచున్న స్థలనివాసుల నిలువ నియోగించి నిజాశ్రితవర్గంబుతో నతి త్వరితగతిం జనుదెంచి శ్రీరంగధామంబుఁ జెంది యాత్మీయ మఠంబునందు నిజచ్ఛాత్రవర్గంబుతో సుఖించుచుండె.

---

* యస్య=ఎవనియొక్క, ప్రసాదకలయా=అనుగ్రహముయొక్క-కూడికచేత, బధిరశ్శృణోతి=చెవిటివాఁడు వినునో, పఙ్గుర్జవేన ప్రధావతి=కుంటివాఁడు వేగముగ పరుగెత్తునో, మూకశ్చవక్తి=మూఁగవాఁడును మాట్లాడునో, అన్ధః ప్రపశ్యతి=గ్రుడ్డివాఁడు చూచునో, వన్ధ్యాసుతం లభతే=గొడ్డురాలు పుత్రునిబడయునో, తం దేవదేవం=అట్టి దేవదేవుఁడను, వరదమ్=వరదుని, శరణం గతోస్మి=శరణుచొచ్చుచున్నాఁడను.

### కప్యాసమిత్యాది శ్రుతివాక్యార్థవిచార ఘట్టము.

యాదవప్రకాశకుఁడు కాశినుండి మరలి కాంచీపురమునకు వచ్చి రామానుజార్యుఁడు క్షేమముగనున్నాఁడని విని అతిభయలజ్జాన్వితమనస్కుఁడై శిష్యులద్వారా రామానుజార్యునితో మరల సఖ్యము చేసెను. అంత నొకనాఁడు రామానుజార్యుఁడు తనకుఁ దైలాభ్యంజనము సల్పుచుండ యాదవప్రకాశకుఁడు * "కప్యాసపుండరీకాక్షః" అను శ్రుతివాక్యమునకు మర్కటాసనమువంటి కన్నులుకలవాఁడని యపార్థము సెప్ప రామానుజార్యుఁడు మహాతరదుఃఖము పొంది యతని నేత్రములనుండి యశ్రుబిందు వొక్కటి యాదవుని యూరుప్రదేశమునఁ బడ నతఁడు రామానుజార్యునివంకఁ జూచి "రామానుజార్యా, ఏల దుఃఖించెదవు" అనియడుగ రామానుజదేశికుఁడు, "శ్రుతివాక్యమునకు మీరపార్థము సెప్ప దుఃఖితుఁడ నైతిని. గంభీరోదకమునఁ బుట్టి సూర్యకిరణములు సోకుటచే మిక్కిలి వికసించిన కమలములవంటి కన్నులుకలవాఁడని చెప్పవలసిన సందర్భమున మర్కటాసనమువంటి కన్నులుకలవాఁడని చెప్పుట హాస్యా

ప్పదముకదా ?" యని చెప్ప యాదవుఁడు మహాక్రోధసమన్వితుఁడై, "ఇంతకన్న బాగుగఁజెప్పఁజాలినవారియొద్దకుఁబోయి చదువుకొనుము. నీవు నాయొద్దనుండఁదగవు, పొమ్ము" అని శాంతచిత్తుఁడగు రామానుజునిదూషించిపొమ్మన నామహానుభావుఁడు తిరుక్కచ్చినంబియొద్దకుఁబోయి యావిషయమంతయు నివేదించి కరిగిరినాథునకు కతిభక్తితో మజ్జనకైంకర్యంబాచరించుచుండెను.

లక్ష్మణార్యుఁడు యామునమునిఁజూడ శ్రీరంగపురికిఁబోవుట.

శ్రీరంగపట్టణమున యామునార్యుఁడు శ్రీమన్నారాయణస్తోత్రము నొక్కటి రచియించి పిమ్మట కాంచీపురమున రామానుజార్యుఁడు యాదవునిసాంగత్యము విడిచి కాంచీపూర్ణునొద్దనున్నాఁడని విని నిజశిష్యు పూర్ణార్యు కాంచీపురమునకుఁబోయి నిజ రచితస్తోత్రరత్నంబును రామానుజార్యు సన్నిధానంబునఁబఠియింప నియోగించెను. మహాపూర్ణుఁడంత నతివేగముగ కంచికి వచ్చి శ్రీహస్తిశైలంబారోహించి యామునకృతిస్తోత్రరాజంబును వరదరాజ

మందిరంబుననతిభక్తితోఁ బఠించి తీక్ష్ణశరకోపంబుల గ్రహించి రామానుజార్యుఁడు వచ్చుమార్గమును కాంచీపూర్ణునివలన నెఱింగి యామార్గంబున నిజగురువిరచితస్తోత్రంబును బఠించుచుండెను. ఇంతలో రామానుజార్యుఁ డేతెంచి యాస్తోత్ర రత్నమాలయందు నాయకమణిప్రాయంబగు ॥ శ్లో॥ స్వాభావికానవధికాతిశయేశితృత్వం *నారాయణ త్వయి నమృష్యతి వైదికః కః। బ్రహ్మాశివశ్శతమఖఃపరమస్స్వరాడిత్యేతేపి యస్య మహిమార్ణవవిప్రుషస్తే ॥ అనుశ్లోకంబు విని విస్మయావిష్టమానసుఁడై పూర్ణాచార్యునిఁ జూచి, "హేద్విజోత్తమా,

* నారాయణ=పాలకడలియందు శయనించునో పరమాత్ముఁడా, స్వాభా.........తృత్వమ్—స్వాభావిక=(నీకు) సహజమైనట్టిదియు, అనవధిక = మేరలేని, అతిశయ = మహిమకలిగినదియునగు, ఈశితృత్వమ్=ప్రభుత్వమును, త్వయి=నీయందు, కఃవైదికః= వేదాంతర్గత తత్త్వవిషయముల నెఱింగిన ఎవఁడు, నమృష్యతి=సహింపఁడు (అనఁగా వేదములు విష్ణుపరాత్పరత్వము నుద్ఘోషించుచున్నవని భావము). బ్రహ్మాశివశ్శతమఖః పరమస్స్వరాట్=బ్రహ్మ, శివుఁడు, ఇంద్రుఁడు, ఉత్కృష్టుఁడగు ముక్తిపూరుషుఁడు, ఇత్యేతేపి=వీరందఱుకూడ, యస్య=ఎవని

ఈమంగళప్రదమగుస్తోత్రం బేమహాత్మునిచే విరచితం బడియె?" అనియడుగ నతండు. "మహాత్మా, రామానుజా, శ్రీరంగక్షేత్రంబున విప్రకులజాతుండు వేదవేదాంగపారగుండు తుర్యాశ్రమసమాపన్నుండు పంచసంస్కారసంస్కృతుండు సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుండు సదాచారసంపన్నుండు యామునార్యుండను పరమభాగవతోత్తముండు గలండు. ఈస్తోత్రం బతనిచే విరచితంబు." అనిచెప్పెను.

యామునార్య చరమవిగ్రహంబున నాకుంచితాంగుళిత్రయంబుం జూచి లక్ష్మణదేశికుం డతని యభీష్టముల నెఱింగి వాని నెఱవేర్తునని వాగ్దత్తము సేయుట.

అంత యామునార్య దర్శనాభిలాషియై లక్ష్మణదేశికుండు కాంచీపూర్ణునికిం దన యభిమతంబు తెలియంబఱచి యతని యనుజ్ఞవడసి మహాపూర్ణునితోంగూడ శ్రీరంగక్షేత్రమునకు బయలుదేరిపోయి తత్పట్టణబాహ్యోద్యాన

---

యొక్క; మహిమార్ణవవిపుషః = మహిమసముద్రమునందు తుంపరలో, తే = అట్టి నీకు (నమస్కారము).

ప్రదేశంబునఁ దిరుక్కలిహాతీర్థఘట్టంబునఁ బెంపారుచున్న గుంపులంజూచి యచటం గన్గొబడు జనుల నడిగి యామునాచార్య చరమావస్థయెఱిఁగి మూర్ఛాక్రాంతుఁడై భూమి మీఁదఁబడ మహాపూర్ణుఁడతని పాణిద్వయంబునఁ బట్టి యెత్తిదుఃఖోపశమనంబులగుమాటలు సెప్పి లక్ష్మణార్యుని తోఁగూడ సమీపంబున కేతెంచి స్వగురుచరమవిగ్రహం బీక్షించి వలగొని మ్రొక్కియుండె. అంతట నయ్యిల యాళ్వార్లు పరమగురుని చరమదశ నీక్షించి శోక వ్యాకులితాంతరంగుఁడై ప్రదక్షిణపూర్వకంబుగా సాష్టాంగ ప్రణామం బాచరించి తదీయాకుంచితాంగుళిత్రయంబు నీక్షించి యక్కడివారినడిగి యది యస్వాభావికమగుట తెలిసికొని పరేఙ్గితజ్ఞుఁ డయ్యిలయాళ్వారులు, "మహానుభావా, ఈ లోకమునందలి వైష్ణవోత్తములు పరమపదమునుసులభముగఁ బొందునట్లు ఇక్కడినుండి వైకుంఠమునకు సోపానముల నేర్పఱుచుటకు నేను సమర్థుఁడను.* దీనికి సంశయములేదు.

---

* అనఁగా జనులయందు భక్తివైరాగ్యంబుల నభివృద్ధిపఱిచి వారిని సదాచారసంపన్నులుగఁ గావించి మోక్షపదవిని సులభముగఁ బొందునట్లు సేయుదునని యర్థము.

అజ్ఞానమోహితులగు జనులను పంచసంస్కారసంపన్నులుగను ద్రవిడామ్నాయపారగులుగను ప్రపత్తిధర్మనిరతులుగను గావించి వారినెల్లప్పుడు రక్షించెదను." అని చెప్ప నొక యంగుళము ప్రసారితంబయ్యె. అంత రామానుజార్యుఁడు మరల, "సర్వతత్త్వార్థములనుగూర్చి నిఖిలజనరక్షణసాధకంబగు శ్రీభాష్యంబును రచించెదను" అని చెప్ప రెండవ యంగుళముకూడ తెఱవఁబడియె. రామానుజదేశికుండు మరల, "హే మహాప్రాజ్ఞ, లోకోజ్జీవనార్థమై పురాణరత్నములరచించిన వ్యాసపరాశరమునిసత్తముల తిరునామములను సదాచారసంపన్నులగు వైష్ణవోత్తముల కిద్దఱకుఁ బెట్టెదను" అని చెప్ప మూఁడవయంగుళమును వికసించె. అక్కడివారందఱు నీమహాద్భుతముం గాంచి విస్మయావిష్టమానసులైరి. లక్ష్మణదేశికుఁ డంత యామునాచార్యకుమారుండగు పుల్లిక్కరిశనంబి మొదలైన యార్యులతో ఖననాదిక్రియలు నిర్వర్తింపంజేసి కావేరియందవభృతస్నానమాచరించి యాచార్యవిశ్లేషజనిత దుఃఖసంతప్తహృదయుఁడై యచటనుండ నొల్లక పెరియనంబి (మహాపూర్ణుఁడు)

యనుజ్ఞవడసి వైష్ణవోత్తములందఱు విశిష్టాద్వైతమతో ద్ధారకుఁడ నగుదువని తనకు మ్రంగళాశాసనంబొనర్ప మహా ప్రసాదంబని గ్రహించి మరలి కాంచీపురంబుఁజెంది యెందు వరదున కెప్పటియట్ల కైంకర్యంబు సేయుచుండె.

లక్ష్మణార్యుఁడు కాంచీపూర్ణోచ్ఛిష్టాన్నమును భుజింపన పేక్షించుట.

కాంచీపురంబున లక్ష్మణదేశికుఁడు శాలకూపము నుండి తీర్థము తెచ్చి నిత్యము వరదరాజున కర్పించుచు కాంచీపూర్ణునికి శిష్యకృత్యం బాచరించుచు కాంచీపూర్ణుఁడు శూద్రకులజాతుఁడైనను పరమభాగవతోత్తముఁడు కాన గుణశీలంబులు, ముఖ్యంబులుకాని జాతిముఖ్యంబు కాదని లోకమునకు నిరూపించుటకై రామానుజార్యుఁ డొకప్పు డాతఁ డుచ్ఛిష్టంబు భుజింప నపేక్షించి కాంచీపూర్ణుని స్వగృహంబున భుజింపు మని ప్రార్థింప నతండును సమ్మతించె. రామానుజార్యుఁ డంత నిజగృహంబు సేరి యావిషయంబు భార్యకుఁ దెలియఁజేసి పంచభక్ష్యపరమాన్నసహితంబును అమృతతుల్యంబునగు వస్తుసముదాయంబు సిద్ధము సేయించి దేవతారాధనము కావించి కాంచీపూర్ణాగమనమునకై

ఎదురుచూచుచుండెను. ఎంతసేపు కనిపెట్టియుండినను కాంచీపూర్ణుఁడు రానందున లక్ష్మణదేశికుఁడంత నతని వెదకుచు కరిశైలంబు దక్షిణమార్గంబున నాతని యింటి ప్రక్కఁబోయెను. కాంచీపూర్ణుం డింతలో నాశైలంబు నుత్తరమార్గంబున రామానుజార్య గృహంబుసేర రామానుజునిభార్యయగు రక్షకాంబ తనభర్త యతని వెదకుచుఁ బోయిన విషయము తెలియఁబఱచి యతఁడు మరల వచ్చునంతవఱకు వేచియుండుఁడని చెప్పెను. కాంచీపూర్ణుఁడంతఁ దాను మిక్కిలి యాఁకలిగొని యున్నాననియు మరల వరదరాజకైంకర్యార్థము శీఘ్రముగఁ బోవలయుననియుఁ జెప్పి రామానుజార్యుఁడు మరలివచ్చునంతలో భోజనము చేసిపోయెను. అంతరక్షకాంబ కాంచీపూర్ణోచ్ఛిష్టాన్నమును సేవకులకుఁ బెట్టి మరల పాత్రశోధనముసేసి స్నాతయై అన్నమును సిద్ధము సేయుచుండెను. ఇంతలో రామానుజార్యుఁడు వచ్చి యావద్విషయమును విని విఫలమనోరథుఁడై మరల దేవతార్చనసేసి నివేదితాన్నమును భుజించి యటి వేగముగ కాంచీపూర్ణుని జూచుటకు వరదరాజాలయంబున

కరిగి, యచ్చట వరదు నెదుట అంజలిబద్ధుండై నిలిచి యున్న తిరుక్కచ్చినంబిని గాంచి యతనిని, "దయానిధీ, నిన్ను శరణుచొచ్చినవాఁడను. నాకు పంచసంస్కారము సేసి నన్ను రక్షింపుము. ఈలోకమున నీకు సమానుఁడగు పురుషుఁ డెక్కడను లేఁడు. నీపాదకమలముల నాశ్రయించిననన్ను నుపేక్షింపఁ దగదు" అని వేడ నతండు "నీప్రవర్తన అత్యంత సాహసికముగను, లోకవిగర్హితముగను, వర్ణసంకరకారణముగ నున్నది. కాఁబట్టి నేను చేయఁగలఁదేమున్నది!" అని బదులు సెప్ప లక్ష్మణార్యుఁడు కాంచీపూర్ణుని మాటతథ్యమని తెలిసికొని తనప్రవర్తన యనాలోచితంబని యెఱింగి యంత తనకు ముక్తిమార్గంబు సూప వరదరాజును ప్రార్థింపుమని కాంచీపూర్ణునివేడ నతండు దానికి సమ్మతించి వరదునికిఁ గైంకర్యంబుసేయుచు నచ్చటనే యుండెను. పరమదయా ళువు వరదుఁడు నిజభక్తుని యంతరంగాభిప్రాయంబు నెఱింగియతనితో, "జగత్కారణ కారణమగు పరబ్రహ్మము నేనే. జీవాత్మ పరమాత్మ భేదము నిస్సంశయాస్పదము. దేహావసాన సమయమున భక్తులకు నిస్సంశయముగ

పరమపద మిచ్చెదను. మహాత్ముఁడగు (పెరియనంబిని) పూర్వాచార్యు నాశ్రయింపుము ? అని నామాటలుగ రామానుజార్యునితోఁ జెప్పుము" అనెను. వరదరాజాంతరంగంబు తిరుకచ్చినంబివలనఁ దెలిసికొని రామానుజార్యుఁడు సంప్రీతమనస్కుఁడై తత్క్షణమే పూర్ణాచార్యు నాశ్రయించుటకుఁ గాంచీపూర్ణుచే ననుజ్ఞాతుండై శ్రీరంగక్షేత్రమునకు బయలు దేరెను.

పెరియనంబి లక్ష్మణార్యునిఁ బంచసంస్కారసంపన్నుఁగావించుట.

శ్రీరంగపట్టణంబున యామునార్యుని శిష్యులగు వైష్ణవులు తద్వియోగదుఃఖాబ్ధియందు మునింగి, తదుణవిశేషంబులఁ గీర్తించుచు తత్సముఁడై నిజగురుసానార్యుఁడై వైష్ణవ మతమును బరిపాలింపఁగల వాఁడెవ్వఁడొకోయని విచారించుచుండఁ గొందఱు శ్రీవైష్ణవులు వారికి దుఃఖోపశమనం బగునట్లు, "పరలోకగతుఁడగు యామునగురుని గూర్చి ఏల దుఃఖించెదరు ! మనలను రక్షించి మనమతము నుద్ధరింప నొకవిప్రోత్తముఁడు బుట్టియున్నాఁడు. అతఁడు సత్యవ్రతక్షేత్రవాసి రామానుజార్యుఁడు. అతఁడు శీలాదిగుణములఁ

యందు యామునగురునికి సమానుఁడు. మనమతమును బ్రతి
ష్ఠాపించి జనులను రక్షించుట కతఁడు సమర్థుఁడు. కాన పూర్ణా
చార్యా, నీవు కాంచీపురమునకుఁబోయి యతనిని బంచసంస్కా
రసంపన్నునిఁగాఁ గావించి యచ్చటఁ గొంతకాలము నివసించి
విష్ణుచిత్తాదిసూరి విరచితంబులును మనమతమున కావశ్యం
బులు నగు గ్రంథముల నతని కుపదేశించి యేదేనొకయుపా
యంబున నతని నిచ్చటికిఁ దోడ్కొని రమ్ము" అని చెప్పఁ
గృపానిధి మహాపూర్ణుఁడు తత్క్షణమే సకుటుంబముగాఁ గాంచీ
పురంబునకు బయలుదేరి కొన్ని దినములకు మధురాంతకము
సేరెను. ఇంతలో శ్రీరంగపట్టణమువంక కేఁగుచున్న రామానుజా
ర్యుఁడును మధురాంతకము సేరి యచ్చట పెరియనంబిని గాంచి
యతిభక్తి వినయంబులతో నతనికి నమస్కరించి, "అతిమనో
హరంబును భుక్తిముక్తి ప్రదాయకంబునగు శ్రీరంగక్షేత్ర
మును విడిచి సకుటుంబముగా నెక్కడికిఁ బోవుచున్నారలు!
ఓమహామతీ, మీరుపోఁదలఁచిన స్థలంబును తత్కారణంబును
నాకుఁజెప్పుఁడు" అని ప్రార్థింప పెరియనంబి యావద్విష
యంబు నతనికిఁ దేటపఱచెను. లక్ష్మణదేశికుఁ డంత నతి

నితో," ఓదయానిధీ నాకిప్పుడు పంచసంస్కారము కావించి నన్ను సంసారకూపమునుండి యుద్ధరింపుము." అని ప్రార్థింప నాఁ గురువర్యుఁడు, "పుణ్యప్రదంబగు సత్యవ్రతక్షేత్రంబున వరదరాజసన్నిధియందు నీకవశ్యము పంచసంస్కారము సేసెదను. సంశయింపవలదు. ఒకదినమోర్చుకొని యుండుము మనమిప్పుడ బయలుదేరి యచ్చటికిఁ బోవుదము." అని చెప్పెను. లక్ష్మణదేశికుఁ డంత సతనితో, "ఓబుధర్షభ శరీరమస్థిరమని యెఱిఁగియు మీరిట్లు సెప్పుట న్యాయమా? మునుపు మనమిద్దఱము యామునార్యుని జూచుటకుఁ గాంచీపురమునుండి బయలుదేరి శ్రీరంగపట్టణమున కతిత్వరితముగఁ బోయియు విఫలమనోరథులమై తిమే మఱచితిరా? మంగళప్రదమగు కార్యంబు నెంత శీఘ్రంబున నెఱవేర్చిన నంత మేలుకాదా? కాఁబట్టి మహానుభావా నన్నతిత్వరితముగఁ బంచసంస్కార సంపన్నునిఁగఁ గావించి రక్షింపుఁడు దయానిధీ" అని ప్రార్థింపఁ గరుణాజలధి పెరియనంబి సమ్మతించి యతనినిసరస్సున స్నానముసేసి రమ్మని కోదండశరధరుండగు రామచంద్రుని సన్నిధియందు పురుషసూక్తాది మూల

మంత్రంబుల జపించి ఇతరవైష్ణవమంత్రంబులతోఁ ఋత్విజ సత్తములతోఁగూడి అగ్నియందు నూటయెనిమిదిసారులు హోమంబుసేసి సుదర్శనపాంచజన్యంబుల గంధపుష్పాక్షలతోఁబూజించి తనయెదుట స్నాతుఁడై ప్రాంజలియై యతి భక్తితోఁ గూర్చుండియున్న రామానుజార్యుని సర్వదివ్య లక్షణసమన్వితంబులగు భుజంబులమీఁద తప్తంబులగు శంఖ చక్రముల శుభచిహ్నంబుల ముద్రించి యతనిఁ బంచ సంస్కారసంపన్నునిఁగఁ గావించి యతనికి ఆపన్నరక్షకంబగు తిరుమంత్రంబు నుపదేశించెను అంతరామానుజార్యుఁడు సంతుష్టాంతరంగుఁడై శరత్కాలచంద్రునిమాడ్కి నిర్మలుఁడై ప్రకాశించె. శ్రీవైష్ణవలక్ష్మిచే సేవింపఁబడి బాలార్కప్రభా భాసమానుఁడగు లక్ష్మణదేశికునిం జూచి యతనితో మహా పూర్ణుఁడు "యామునార్యుని వెనుక వైష్ణవమతమును బ్రతిష్ఠాపించి వైష్ణవుల నుద్ధరింపఁ గలవాఁడు నీవుతప్ప మఱెవ్వరును లేరు. నీయద్భుత తేజస్సును జూడ నాకిమాట సెప్పఁగుతూహలము కలిగె." అనిచెప్ప నతఁడు మహా ప్రసాదంబని గ్రహించి మొదట పెరియనంబిని పిమ్మట

తక్కిన వైష్ణవోత్తముల నందఱిని యథావిధిగఁ బూజించి యంతట పెరియనంబి సకుటుంబముగాఁ జోడరా సత్యవ్రతక్షేత్రమునకుఁ బోయి యావద్విషయమును తిరుక్కచ్చినంబికి నివేదించి పిమ్మట స్వగృహమునేరి తనయింటనుండిన ధనమునంతయు సత్యాదరముతో మహాపూర్ణగురుని కిచ్చి యతనివలన ద్రవిడామ్నాయాది సకలవైష్ణవగ్రంథంబుల నాలుమాసములలో నభ్యసించెను.

### లక్ష్మణార్యుఁడు భార్యను బరిత్యజించుట.

అంత నొక్కనాఁడు లక్ష్మణార్యుఁడు తలంటుకొనుదినమున, తలంటువాని నొకబ్రాహ్మణుని బిలిచి యతనిచేత నంటించుకొని పిమ్మట నతఁడు విశేషశ్రమచేత క్షుత్పీతుఁడై యుండఁ జూచి తనభార్యను బిలిచి యింటనేమైనఁ గలదాయని యడుగ నామె కొంచెమైనను లేదని చెప్పెను. ఆమెమాటను విశ్వసింపక లక్ష్మణార్యుఁడు లోపలికి బోయి వెదకి చూచి పాత్రసంస్థితంబగునన్నంబుఁ గాంచి యతికరుణాకోపంబులు మనంబునఁ బెనఁగొన భార్యతో, "హా! నీహృదయం బెంత క్రూరము! స్త్రీలు సకలపాప

బులకు స్థానభూతలు అనులోకోక్తి నిజము” అని పలికి భార్యను జూచి హేయపడి యుండెను. పిమ్మట నొక నాఁడు రక్షకాంబ బిందెను జేతఁబూని జలార్థమై సమీప మందున్న బావికి బోయెను. అప్పుడే కాంచీపూర్ణుని భార్యయు నచ్చటికి వచ్చెను. అంత నిద్దఱును ఒకేసారి బిందెలను బావిలోనికి విడిచి చేఁదుచుండ కాంచీపూర్ణుని భార్యయొక్క బిందెనుండి జలబిందువులు రక్షకాంబయొక్క బిందెమీఁదఁబడఁగా నామె కోపసంరక్తలోచనములతోఁ గాంచీపూర్ణుభార్యవంకఁ దిరిగిచూడ నామె యిట్లని చెప్పఁ దొడఁగె. “నేను గురుపత్నిని గురుఁడెట్లుపూజ్యుఁడు అట్లే గురుపత్నియు పూజ్యయే కదా? కాఁబట్టి నాఘటమునుండి జలబిందువులు నీఘటముమీఁదఁ బడుటచే నీఘటము పరిశుద్ధమైనది. అందుకు నీవేల కోపించెదవు?” అనఁనంత రక్షకాంబ కాంచీపూర్ణుని భార్యతో, “హీనజాతియందుఁబుట్టి నీవేలగర్వపడెదవు? నీజాతియెంత, నీశీలమెంత నీకు ద్రవ్యాదిసంపదకలదా?” అని పరుషవాక్యము లాడ నచ్చట నిద్దఱికిని మహాకలహము సంభవించెను. ఆ విషయము

తిరుక్కచ్చినంబి విని భార్యమీఁద విశేషముగఁ గోపించి తత్క్షణమే సకుటుంబముగా శ్రీరంగక్షేత్రమునకు బయలుదేరి పోయెను. మఱునాఁడు రామానుజార్యుఁడు తిరుక్కచ్చినంబి యింటికిఁబోయి యచ్చట నతనిం గానక యతండు శ్రీరంగ క్షేత్రమునకు సకుటుంబముగాఁ బోయినాఁడని విని తత్కార ణంబు పెరియనంబి నడుఁగ నతండు రామానుజార్యునితో, "మీయిద్దఱిభార్యలును బావియొద్ద జగడమాడిరి. అది కారణంబుగఁ గాంచీపూర్ణుఁ డిక్కడనుండరాదని శ్రీరంగ క్షేత్రమునకుఁ బోయెను. వారిజగడమునకుఁ గారణంబే మోవరదుఁడే ఎఱుఁగవలయు" అని చెప్పరామానుజార్యుఁడు మహాదుఃఖపరవశుఁడై స్వగృహంబున కేతెంచి కలహమును గుఱించిన యావద్వృత్తాంతమును భార్యవలనఁ దెలిసికొని యంతకోపసంరక్తనయనుఁడై భార్యనుజూచి, "నీవునావిష యమై యిదివఱ కెన్నియో యపరాధంబులు కావించితివి; వానినన్నిఁటిని సహించితిని కాని దీనిని మాత్రము సహింపఁ జాల. పతిచిత్తానువర్తనము స్త్రీలకు పరమధర్మమైయుండ నీపనులన్నియు మన్నత వ్యతిరిక్తములుగ నున్నవి కాన,

నీవిఁక నాగృహంబున నుండఁదగవు. తత్క్షణము నాయిల్లు విడిచి నీతండ్రి గృహంబునకుఁ బొమ్ము." అని చెప్ప రక్ష కాంబ భయము చే దేహమాత్యంతము కంపింప కన్నులనీరు కాలువలై కార దీనముఖయై యుండెను. శోకసమన్వితయగు తనభార్యను జూచి కరుణాజలధి రామానుజార్యుఁడు సైరణ వహించి భార్యనుక్షమించెను. అనంతర మొకనాఁడు వరద రాజకైంకర్యైకలోలుఁడగు రామానుజార్యుని జూచి పండి తుండగు నొక బ్రాహ్మణుఁడు క్షుత్పీడితుఁడనని చెప్పి యన్నదానము సేయుమని ప్రార్థించెను. రామానుజార్యుఁ డతని మీఁదఁ గరుణచెంది తానప్పుడు వరదరాజకైంకర్యము సేయుచుండినందున ఇంటికి వచ్చుటకు వలనుపడదు కాన తాను పంపినట్లు సెప్పి తనభార్య నడిగి యన్నము పెట్టించు కొని భోజనము సేయుమని సెప్పెను. అంత నాబ్రాహ్మ ణుఁడు పరమానంద భరితుఁడై రామానుజార్యునిగృహంబు సేరి రక్షకాంబతో, " ఓపతివ్రతారత్నమా, వరదరాజ కైంకర్యలోలుఁడగు నీభర్తచేఁ బంపఁబడితిని. క్షుత్పీడితుఁ డను నాకు శీఘ్రంబ అన్నదానముసేయుము తల్లీ" అని.

మొఱపెట్ట నాతని పలుకులఁ బెడచెవిని బెట్టి యామె అత్తనితో, "అన్నముకాని బియ్యముకాని ఏదియు నిక్కడ దొరకదు. కాన ఇక్కడ నిలువకు నిలువకు నీవెవరిచే నంపఁబడితివో పోయి యాదయానిధిని యాచింపుము" అని పరుషవాక్యంబు లాడ నా విప్రుం డంతట అన్నము మీఁది యాశ వదలుకొని మరలి లక్ష్మణార్యుని యొద్దకుఁ బోయి యతని భార్య తన్నాడిన పరుషవాక్యంబు లతనితోఁ జెప్ప నాతండు భార్యవిషయ మత్యంతము హేయపడి యామె నెట్లైనఁ బరిత్యజింపవలయునని తత్క్షణము ఆ మెతండ్రియొద్దనుండివచ్చినట్లు, ఒకజాబును సృష్టించి యొకనూతన వస్త్రముఁ గొని యాజాబు నా వస్త్రము నొక బ్రాహ్మణుని చేతికిచ్చి యతనిని తనభార్యయొద్దకుఁ బోయి తా నామె సహోదరుని వివాహార్థమై యామెను బిలుచుకొనిపోవుటకు యామెతండ్రి యాజ్ఞచొప్పున వచ్చినట్లు చెప్పుమని ప్రేరేపించి పంపెను.

ఇట్లసత్యమునకుఁ బాలుపడిన రామానుజార్యుఁడు లోక 'గురుస్థానమున కర్హుఁడేనా? భార్యధర్మార్థమునఁ బ్రవేశించిన నామె నెట్లైన సన్మార్గమునకుఁ దేఁదగిన ప్రయత్నము

సేయవలయుఁగాని యామెను ద్యజింపఁదగునా? అనికొంద ఱాక్షేపింపవచ్చును.

అహింస పరమధర్మముకాని యబద్ధము సెప్పకుండుట పరమధర్మము కాదు. ఇప్పటిభూతి దుష్టభూయిష్ఠంబుగ నున్నది కాన ధర్మపరులు దుర్జనుల మాయోపాయంబులకుఁ బ్రత్యుపాయములు పన్ని కొంతవఱకుఁ గపటము వహించి ప్రవర్తించినఁగాని ధర్మసంస్థాపనము సేయఁజాలరు. అబద్ధమాడుటచే నేరికిని హింసకలుగక లోకమునకు మేలు కలుగునట్లుండునపుడు అబద్ధమాడుటయే పరమధర్మము. పరహింసాపరులగు దొంగలచేఁ జిక్కి తప్పించుకొన్నయొకఁడు వచ్చి తన్ను శరణు చొచ్చిన పిమ్మట నాతని వెదకుచు దొంగలు వచ్చి యతఁడెక్కడయని తన్నడిగిన తానప్పుడు నిజము చెప్పి యుతని దొంగలపాలుసేయుటయా ధర్మము లేక అబద్ధము సెప్పి యతని రక్షించుటయా? ఇట్టిధర్మసందేహము లితరమతస్థు లింకను నివర్తిచేసికొనఁజాల కున్నారు కాని మనఆర్య ధర్మశాస్త్రంబులన్నియు "అహింసా పరమో ధర్మః" అని యేకగ్రీవముగా నుద్ఘోషించుచున్నవి. కాఁబట్టి

అబద్ధమాడుట చేతనే దోషము సంభవింపదు. స్వప్రయోజనార్థమైకాని పరహింసా కారణంబుగఁగాని యబద్ధ మాడుట తప్పుకాని యితరుని హింసకలుగక లోకమున కంతయు నుపకారంబు సంభవించునప్పుడు అబద్ధమాడుటయే పరమ ధర్మము.

తిరుమజ్గయాళ్వారులు చోరాగ్రేసర చక్రవర్తికదా? ఐన నతని వైష్ణవులందఱు నిత్యసూరులలో నొక్కనిఁగ భజింతురు. ఇదిహాస్యాస్పదమని కదా మొదట మనకుఁ దోఁచును? కొంత సావధాన మనస్కులమై యాలోచింతము. తిరుమజ్గయాళ్వారులు దొంగిలించిన ధనము నేమి చేసెను? స్వోదరపోషణార్థమైకాని విషయసౌఖ్యానుభవమునకుఁగాని వ్యయపఱిచెనా? ఆయనదొంగిలించినను ఆధనమునంతయు లోకోపకారార్థమై వినియోగించెను. ఐన మనముకూడ లోకోపకారము సేయుటకై దొంగిలింపవచ్చునా యని కొందఱు సందేహింపవచ్చును. తిరుమజ్గయాళ్వారులయొక్క యధ్యవసాయము కలవారు దొంగిలించినఁ దప్పుకాదు. తిరుమజ్గయాళ్వారులు తనస్వాతంత్ర్య

మును నశింపఁజేసి పరమాత్మునికిఁ బరవశుఁడై శరణాగతి చేసి ఇవ్విధముతో నైక్యభావము నొందినవాఁడు. అట్టి వాఁడేమిచేసినను పరమేశ్వరకృత్యంబులతో సమానంబులు కాని, వానివలన దోషంబు జీవు నంటదు. కృత్యంబుల ఫలంబు లపేక్షించు వారికిఁ గదా సత్కార్యంబుల వలనఁ బుణ్యంబును దుష్కార్యంబులవలన పాపంబును కలుగు. సర్వం శ్రీకృష్ణార్పణ మస్తు అని స్వాతంత్ర్యమును విడిచి ఫలాపేక్ష లేక వర్తించువారు చెడుకార్యములు చేసినను దోషమును బొందరు. ఫలాపేక్షకులు పుణ్యాపాపంబులఁ బొందువారు. సర్వసంగపరిత్యాగము చేసి సంసారచక్రము నుండి ముక్తి నపేక్షించు ముముక్షువులు పుణ్యాపాపంబుల కతీతులు. అట్టివారు, అనఁగా, తిరుమజ్గయాళ్వారుల వంటి వారు కాలస్వభావంబును బట్టి సామాన్యముగ దుష్కృత్యంబులని చెప్పఁదగిన కార్యంబులఁ జేసినను వానివలని దోషంబు బొందరు. వారిని జూచి సామాన్యజను లట్టికృత్యంబులు చేయఁజూచుట పులినిజూచి నక్కదేహ మంతయు వాఁతలు వేసికొన్నట్లు హాస్యాస్పదముగ నుండును.

ఇదియునుంగాక యేకార్యంబైనను కర్తయొక్క యుద్దేశ మరయక ధర్మమనికాని యధర్మమనికాని, నిరూపింపం దగదు. అట్లు నిరూపించుట యేఫలముయొక్కకాని బాహ్యస్వరూపమునుమాత్రము జూచి దానిరుచి నూహించుటవలె యనాధారంబగును. కొన్నిపండ్లు పైకి అతిమనోహరములుగను తిన్నంజేదుగ నుండును. అట్లే కొందఱికృత్యంబులు పైకి లోకోపకారకారణంబులైనను నిజ మరయ నవి స్వప్రయోజనార్థము చేయంబడినవని తెలియవచ్చును. మఱికొందఱిపనులు మొదట చూచుటకు హేయములుగనుండినను తత్కర్తల యుద్దేశం బరయ నవి లోకోపకారార్థము పరమాత్మపారవశ్యంబునం జేయంబడినవని తెలియును. పరశురాముఁడు మాతృవధ కావించె! హా పరశురాముం డెంత ద్రోహి! ఎంతక్రూరుఁడు! అనికదా మొట్టమొదట నీయితిహాసమును వినువారికిం దోఁచును. ఐన నావిషయమును గొంతచక్కఁగాంబరిశీలింతము. పరశురాముఁడు తానుగా మాతృవధ సేయలేదు పితృవాక్యోల్లంఘనము సేయలేక చేసెను. ఐనఁదండ్రి దుష్కార్యము సేయుమన్నం జేయ

వచ్చునా ! పితృవాక్యోల్లంఘనము కావించియు ప్రహ్లాదుఁడు ముక్తిని బొందలేదా? కాఁబట్టి సన్మార్గమునందుఁ బ్రవర్తింపు మని బోధించుతండ్రి మాటదాఁటినఁ దప్పుకాని దుష్కృత్యమును జేయుమని బోధించుతండ్రిమాటను దిరస్కరించుటయే ధర్మము. సన్మార్గమునఁబొమ్మని సత్కార్యములఁ జేయుమని బోధించుతండ్రియే తండ్రికాని దుష్కృత్యముల సేయుమని పుత్త్రినాజ్ఞాపించువాఁడును దండ్రియా? కాఁబట్టి పరశురాముఁడు తనయన్నలవలె తండ్రియాజ్ఞను దిరస్కరించి యుండవలసినదని కొందఱు వాదింపవచ్చును. ప్రస్తుతేతి హాసంబున జమదగ్ని నిష్కారణంబున దనభార్యను జంపింపఁ బ్రయత్నింప లేదు. భార్య తనవిషయంబున నపరాధంబు సేసెఁ గాన నామె శిక్షార్హయే. శిక్షార్హయగు • తల్లికన్న మహాతపోధనసంపన్నుఁడును చండభానుప్రభా భాసమానుఁడును జ్ఞానమూర్తియు నగు తండ్రి ఎన్నింతలో యెక్కువగఁ బూజ్యుఁడు కదా ? ఇదియునుంగాక పిత్రాజ్ఞోల్లంఘనంబున పరశురామునియన్నలు శాపసంతప్తులైరి. అప్పుడు •జమదగ్ని కోపపరవశుఁడై భార్యను జంపింపఁదలఁచినను

బిమ్మట నామెను బ్రతికించుశక్తి యాయనకుఁ గలదు. కాఁబట్టి పూర్వోత్తరసందర్భజ్ఞుఁడగు పరశురాముఁ డన్ని విషయంబుల నాలోచించి పితృవాక్యము అవశ్య కర్తవ్యం బని మాతృవధ కావించి పిమ్మట జమదగ్నివలన మాతృ పునరుజ్జీవము వరంబుగాఁబొందెను గాని ధర్మస్వరూపము తెలియక మాతృవధ కావించినవాఁడు కాఁడు ఇట్లే మహా పురుషులయొక్క కృత్యంబుల విచారించునప్పుడు వారి యుద్దేశంబులను పూర్వోత్తరసందర్భంబులను జక్కఁగవిమ ర్శించినఁగాని ధర్మాధర్మ నిర్ధారణంబు సేయుట సాధ్యము కాదు.

కాఁబట్టి రామానుజార్యుఁ డసత్య ప్రవర్తన ముచే భార్యను ద్యజించినను దానివలన నతఁడు స్వప్ర యోజనమును స్వేచ్ఛా విహారంబు నపేక్షింపక లోకోప కారము సేయఁదలఁచెను కాన నదియొక తప్పుకాదు. భార్యకు హితోపదేశము సేయుచు గృహచ్ఛిద్రముల సంస్క రించుచుఁ గాలయాపనము సేయుచుండిన లోకోద్ధార కులగు రామానుజార్యునివంటి వారు జనులందఱు సులభ

ముగఁ బరమపదము నొందునట్లు ఈలోకమునుండి వైకుంఠ పర్యంతము సోపాన నిర్మాణమెట్లు కావింపనేర్తురు? లోక గురువులగు రామానుజార్యునివంటివారికి భార్యలు, బిడ్డలు, అన్నలు, తమ్ములు అని సంబంధబాంధవ్య పరిమితి కలదా? జనులందఱువారికి సోదరప్రాయులు. మనవలె మొట్టమొదట దారపుత్త్రాదులను బోషింపవలయును పిమ్మట లోకక్షేమార్థమై పాటుపడవలయునను కట్టుపాటు పెట్టుకొన్న వారికీలోకమున ధర్మసంస్థాపనము సేయుట సాధ్యపడదు. ఇది యునుంగాక రామానుజార్యుఁడు తనభార్య నిజచిత్తానువర్తయైయుండిన నామెను బరిత్యజించియుండఁడు. తా నింకమీఁదటఁ జేయఁబోవు సత్కృత్యములకు అవిధేయయగు తన భార్యవలన విఘ్నము కలుగునని ముందుగాఁ దెలిసికొని, యామెనుబరిత్యజించెను. కాన దీనివలన మనము తెలిసికొనఁదగిన ధర్మవిషయమేమన, భార్యసన్మార్గయై పతిచిత్తానువర్తయైయున్న నామెను లోకోపకారార్థము పాటుపడ నుద్యుక్తుఁడగు వాఁడుకూడఁ బరిత్యజింపఁ గూడదు, సామాన్యజనులు తమభార్యలు దుర్మార్గమునఁ బ్రవేశించినను వారినెట్టులైన

సన్మార్గమునకుఁ దెచ్చు ప్రయత్నము చేసి చూచి విఫలు లైనను యావజ్జీవము వారికి హితోపదేశము సేయుచు వారిని సన్మార్గమునకు దెచ్చి రక్షింపుమని భగవంతుని ప్రార్థించుచుఁ గాలయాపనము సేయవలసినదే కాని వారిని త్యజింపరాదు. వారిని త్యజించిన పిమ్మట లోకోపకారము నేమైన చేయు సామర్థ్యము కలవారు భార్యలను త్యజించుట యొకతప్పు కాదు.

అట్లు భార్యను తత్పితృగృహంబున కుంబనిచి రామాను జార్యుఁడు త్రిదండకమండలకాషాయ వస్త్రాదికంబులగు సర్వోపకరణంబుల సంపాదించి వరదరాజసన్నిధియందు అతనికి నమస్కరించి లోకపావనంబగు యామునార్యుని చరణద్వయంబును మనసా స్మరించి సన్న్యాసాశ్రమమును స్వీకరించెను. అంత నాసత్యవ్రతక్షేత్రంబున నొక మఠము నేర్పాటు చేసికొని యచ్చటఁ బ్రవేశింప నాపట్టణపు జను లందఱు వచ్చి యచ్చట నతనిఁ బూజించిరి.

కాంచీపట్టణముతూర్పున పురుషమంగళమను నొక యగ్రహారము కలదు. అచ్చట అనంతదీక్షితుఁడను నొక

బ్రాహ్మణోత్తముఁడు వేదవేదాంగపారగుఁడుండెను. అతఁడు కేశవసోమయాజియొక్క కూఁతు వివాహమాడి యామెవలన హరిభక్తిపరాయణుండగు దాశరథియని ప్రసిద్ధి నొందిన పుత్త్రరత్నంబు గాంచె. ఈదాశరథిభరతాళ్వారుల యంశమునఁ బుట్టెనని ప్రసిద్ధి. తనమేనమామ రామానుజార్యుఁడు తుర్యాశ్రమమును స్వీకరించెనని విని దాశరథి సంతుష్టాంతరంగుఁడై తత్క్షణమే కాంచీపురంబున కేతెంచి యతీంద్రునికి భక్తిపూర్వకముగా నమస్కారము సేసి యాతనిపాదకమలంబుల నాశ్రయించెను. పిమ్మట రామాంశమున అనంతభట్టునికిఁబుట్టిన కూరనాథుఁడు కూడవచ్చి రామానుజార్యుని పాదకమలంబుల నాశ్రయించెను. రామానుజార్యుఁ డంతవారికిఁ బ్రీతిపూర్వకంబుగ వైష్ణవగ్రంథములనుపదేశించుచుఁ గాంచీపురంబున నుండె. ఇట్లుండ నొక్కనాఁడు యాదవప్రకాశకునితల్లి రామానుజార్యుని మఠము వంక వచ్చి యచ్చట ఊర్ధ్వపుండ్రముల ధరించి కాషాయాంబరశోభితుఁడై త్రిదండకమండలంబులఁ జేతఁ బట్టుకొని సాక్షాన్నారాయణమునివలె చండభాస్కరుని

పగిది తేజోరాశియై వెలుంగు యతీంద్రునిజూచి యతనికి నమస్కరించి యంతయాదవ్రుని మఠమునకుం బోయి యచ్చట నతనితో, "వత్సా! భక్తితో నావాక్యంబు వినుము. మహాప్రాజ్ఞుఁడగు రామానుజార్యుని మనుపటివలె యవ మానింపకుము. అతఁడు హరిచేఁ బ్రేరేపింపఁబడి ఈలోక మున ధర్మమును సంస్థాపించుటకై యవతరించిన సాక్షాద నంతుఁడు, విద్యాచారాదిక బాహ్యపరిభవము శవాలంకర ణమువలె వ్యర్థము. విష్ణువే జగత్కర్త, విష్ణువే సృష్టిస్థితి లయకారణభూతుఁడు, తత్త్వార్థవేదులగు పరాశరాది మునులందఱు జగత్పతి నారాయణు నాశ్రయించి ముక్తికిఁ బోయిరి. కాన నారాయణుని భజింపుము. రామాను జార్యు నాశ్రయింపుము. తద్ద్వారా ముక్తిని బొందుము" అనిబోధించిన తల్లిమాటలు విని యాదవుఁడు సంశయాపన్న మానసుఁడై మఠమునకుఁబోయి యచ్చట లక్ష్మణదేశి కునితో, "నీవుధరించియుండెడు శంఖచక్రోర్ధ్వపుండ్రాదుల వలన నిర్గుణుఁడగు పరమాత్మునికి గుణిత్వ మారోపించు నట్లున్నది. దానికి శాస్త్రములం దెక్కడను బ్రమాణము

లేదే" అనిచెప్ప లక్ష్మణదేశికుఁడు యాదవునితో సంభాషించుటకు కూరేశుని కనుజ్ఞ యిచ్చెను. కూరేశుఁ డంత యాదవప్రకాశునితో- "బ్రహ్మము సగుణమని చెప్పుటకును, విష్ణువు సర్వదేవతలలో సర్వోత్తముఁడనుటకును, శంఖచక్రాదుల చిహ్నంబుల ధరించుటకును బ్రమాణంబులఁ జెప్పెదను వినుము" అనిచెప్పి యీక్రింది ప్రమాణంబుల వరుసగా నుదాహరించెను.

1. శ్రుతిః॥ ప్రతప్తే విష్ణో రబ్జచక్రే పవిత్రే జన్మామ్భోధిమ్ తర్తవే చర్షణీన్ద్రాః । మూలే బాహ్వో ర్దధ తేన్యే పురాణలిఙ్గాన్యఙ్గే తావకాన్యర్పయన్తి ॥

---

1. చర్షణీన్ద్రాః=మానవశ్రేష్ఠులు అనఁగా ముముక్షువులు, బాహ్వోః =భుజములయొక్క, మూలే=అగ్రభాగములందు, ప్రతప్తే=తప్తములైనట్టియు, పవిత్రే = పావనములైనట్టియు, విష్ణోః = విష్ణువుయొక్క, అబ్జచక్రే= శంఖచక్రములను, దధతే=ధరింతురు, (తన్మూలమున) జన్మామ్భోధిమ్= భవసముద్రమును, తర్తవే = తరింతురు; తావకాని = నీయొక్క, అన్యే పురాణలిఙ్గాని = ఇతరప్రాచీనచిహ్నములను, అఙ్గే = దేహమునందు, అర్పయన్తి = ధరింతురు.

2. సామ్ని॥ పవిత్రమిత్యగ్నిః। అగ్నిర్వై సహస్రారః। సహస్రారో నేమిః । నేమినాతప్తతనూర్బ్రహ్మణస్సాయుజ్యగ్ం సలోకతామాప్నోతి ॥

3. అథర్వణి॥ ఏభిర్వ్యయమురుక్రమస్యచిహ్నై రఙ్కితా

---

2. సామవేదమునుండి ప్రమాణము॥

పవిత్రమిత్యగ్నిః = అగ్నిస్వతః పవిత్రమగువస్తువు, అగ్నిర్వైసహస్రారః = అగ్నియే విష్ణువుచక్రమునందు వేయి ఆకులుగా ఏర్పడియున్నవి. సహస్రారోనేమిః = ఆవేయి ఆకులే నేమి (అనఁగా చక్రముయొక్క అంచునందలి పట్టె) గానేర్పడి యున్నవి. నేమినాతప్తతనూః = అపట్టెవలన తప్తమగుదేహముకలవారు, బ్రహ్మణః సాయుజ్యగ్ం సలోకతామాప్నోతి= పరబ్రహ్మముతో నైక్యభావమును బొంది సాలోక్యమును బొందుదురు.

3. అథర్వణవేదమునుండి ॥ తద్విష్ణోః = ఆవిష్ణువుయొక్క, యేలాఞ్ఛితాః = ఏచిహ్నములతోఁ గూడి, పరమంపదమ్ = వైకుంఠమును, గచ్ఛన్తి = పొందు

లోకే సుభగా భవామః। తద్విష్ణోః పరమం
పదం యే గచ్ఛన్తి లాఞ్ఛితాః

4. పరాశరసంహితాయామ్ ॥ ఉపవీతాదివ ద్ధార్యా
శ్శఙ్ఖచక్రాదయ స్తథా బ్రాహ్మణస్య విశేషేణ
వైష్ణవస్య విశేషతః ॥

5 భీష్మపర్వణి ॥ బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యై

---

దుగా, ఏభిః ఉరుక్రమస్యచిహ్నైః = ఈ విష్ణువుయొక్క చిహ్నములతో, అఙ్కితాః = గుర్తింపఁబడెడు, వయమ్ = మేము, లోకే = ఈలోకమునందు, సుభగాః = మనోహరులముగా, భవామః = అగుదుము.

(4) బ్రాహ్మణస్య = బ్రాహ్మణునికి, విశేషేణ = ముఖ్యముగను, వైష్ణవస్య = వైష్ణవునకు, విశేషతః = అంతకన్న ముఖ్యముగను, ఉపవీతాదివత్ = ఉపవీతాదులవలె, తథా = అట్లే, శఙ్ఖచక్రాదయః = శంఖచక్రాది విష్ణుచిహ్నంబులు, ధార్యాః = ధరింపవలసినవి.

(5) స్వకర్మసు = తమకర్మములయందు, నిత్యం ఉక్తైః = దినము ఉచ్చరించు మంత్రములతోఁగూడ ('విష్ణోః = విష్ణువు'

శ్శూద్రైశ్చ కృతలక్షణైః। అర్చనీయ శ్చ వన్ద్య
శ్చ నిత్య ముక్తై స్స్వకర్మసు॥

5. శ్లో॥ అష్టాక్షరవిద స్సర్వే తప్తచక్రాఙ్కితా
స్తథా। సేవకా వాసుదేవస్య తత్రైవ నట

---

అని అధ్యాహార్యము), బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యై శ్శూద్రైశ్చ కృతలక్షణైః = కృతలక్షణులగు (ప్రసిద్ధగుణములుగల లేక శంఖచక్రాదుల గుర్తులుగల) బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులచే, అర్చనీయశ్చ=పూజింపఁదగినవాఁడు, వన్ద్యశ్చ = స్తుతింపఁదగినవాఁడు.

5. వాసుదేవస్య = విష్ణువుయొక్క, సేవకాః = సేవకులు, తత్రైవ = అట్లే, నటనర్తకాః = నాట్యమాడువారును, నృత్యముసేయువారును, సర్వే= అందఱు, అష్టాక్షరవిదః= అష్టాక్షరీమంత్రమును (ఓంనమోనారాయణాయ) తెలిసినవారుగ, (యథా = ఎట్లో) తథా = అట్లే, తప్తచక్రాఙ్కితాః = తప్తమగు చక్రముయొక్క గుర్తుకలవారుగా ("ఉండవలసినది" అని అధ్యాహార్యము). తత్ర= అచ్చట, అన్యేవైష్ణవాశ్చ = ఇతరవైష్ణవులును, సర్వే = అందఱు,

న్తరకాః॥ అన్యే చ వైష్ణవా స్తత్ర సర్వే
చక్రేణ లాఞ్ఛితాః॥

6. స్కాన్దే॥ యేషాం చక్రాఙ్కితం గాత్రం శూద్రేష్వ
పిచ దృశ్యతే। తేవై స్వర్గస్య నేతారో
బ్రాహ్మణా భువి దుర్లభాః॥

7. పరాశరః॥ వినా యజ్ఞోపవీతేన వినా చక్రస్య ధార

---

చక్రేణలాఞ్ఛితాః చక్రముచే గుర్తునొందినవారుగా (ఉండ
వలయును)

6. శూద్రేష్వపిచ = శూద్రులలోనైనను, యేషామ్ = ఎవరి
యొక్క, చక్రాఙ్కితమ్=చక్రముయొక్క గుర్తునుబొందిన,
గాత్రమ్ = దేహము, దృశ్యతే = కనఁబడుచున్నదో,
తేవై = వారే, స్వర్గస్యనేతారో = స్వర్గాధికారులు.
బ్రాహ్మణాః = (చక్రాంకితదేహముకల) బ్రాహ్మణులు,
భువిదుర్లభాః = భూమియందుదొరకరు (అనఁగా పునర్జన్మ
రహితమగు మోక్షపదవినిబొందుదురు.

7. యజ్ఞోపవీతేన = జందెముచేతను, చక్రస్యధారణాత్ =
చక్రముయొక్క ధరించుటవలనను, ద్వయేన = ద్వయమం
త్రముచేతను (“శ్రీమన్నారాయణచరణౌశరణం ప్రపద్యే

ణాత్ వినా ద్వయేన హై విప్ర శ్చణ్డా
లత్వ మవాప్నుయాత్ ॥

8. అనిష్టానాం నివృత్త్యర్థ మైకాన్త్యాయ జగత్పతౌ
సిద్ధ్యర్థం కర్మణాం చైవ ధార్యం చక్రాదిలాఞ్ఛనమ్॥
9. దక్షిణే తు భుజే విప్రో బిభృయాద్వై సుదర్శనమ్

శ్రీమతేనారాయణాయనమః" (అనునది ద్వయమంత్రము), వినా = విడువఁబడిన, విప్రశ్చ = బ్రాహ్మణుఁడును, చణ్డాలత్వమ్ = మాలవానియొక్క స్థితిని, అవాప్నుయాత్ = పొందును.

8. అనిష్టానామ్ = ఇష్టముకానిదానియొక్క, నివృత్త్యర్థమ్ = పోవుటకొఱకును, జగత్పతౌ = విష్ణువునందు, ఐకాన్త్యాయ = ఐక్యమునుబొందుటకును, కర్మణామ్ = కర్మలయొక్క, సిద్ధ్యర్థం చైవ = సిద్ధికొఱకును, చక్రాదిలాఞ్ఛనమ్ = చక్రము మొదలైనవానియొక్క గుర్తు, ధార్యమ్ = ధరింపఁదగినది (ధరింపవలయును).

9. విప్రః = బ్రాహ్మణుఁడు, దక్షిణేతుభుజే = కుడిభుజమునందు, సుదర్శనమ్ = చక్రమును, బిభృయాత్ = ధరింపవలయును, సవ్యేతు = ఎడమభుజమున, శఙ్ఖమ్ = శంఖ

సవ్యేతు శఙ్ఖం బిభృయాదితి బ్రహ్మవిదో విదుః ॥

10. అథర్వణోపనిషది ॥ హరేః పదాకృతి మాత్మనో హితాయ మధ్యే చ్ఛిద్ర మూర్ధ్వ పుణ్డ్రం యో ధారయతి । స పరస్య ప్రియో భవతి । స పుణ్యవాన్భవతి । స ముక్తివాన్భవతి ॥

11. మహోపనిషది ॥ ధృతోర్ధ్వపుణ్డ్రః పరమీశితారమ్ నారాయణం సాంఖ్యయోగాధిగమ్యమ్ । జ్ఞా

---

మును, బిభృయాత్ = ధరింపవలయును, ఇతి=అని. బ్రహ్మవిదః = తత్త్వవేత్తలు, విదుః = చెప్పుదురు.

10. యః = ఎవఁడు, హరేః = విష్ణువుయొక్క, పదాకృతిమ్ = పాదముయొక్క రూపమునుబోలినట్టియు, మధ్యే = నడుమ, ఛిద్రమ్ = శూన్యమైనదియునగు, ఊర్ధ్వపుణ్డ్రమ్ = ఊర్ధ్వపుండ్రమును, ధారయతి = ధరించునో, సః = వాఁడు, పరస్యప్రియః = ఇతరునికిష్టుఁడుగ, భవతి=అగుచున్నాఁడు, సః = వాఁడు, పుణ్యవాన్ = పుణ్యవంతుఁడుగ, భవతి = అగుచున్నాఁడు, సః = వాఁడు, ముక్తివాన్= ముక్తినిబొందినవాఁడుగ, భవతి=అగుచున్నాఁడు.

11 నరః = మనుష్యుఁడు, ధృతోర్ధ్వపుణ్డ్రః = ఊర్ధ్వపుండ్రమును ధరించినవాఁడై, పరమ్ = శ్రేష్ఠుఁడును, ఈశితా-

త్వా విముచ్యేత నరస్సమస్తై స్సంసారపాశై రిహ
చేతి విష్ణుమ్ ॥

13. ఆగ్నేయే॥ త్రిపుణ్డ్రం బ్రాహ్మణో విద్వాన్ లీల
యాపి నధారయేత్ ధారయే త్ప్రియత స్సమ్య
గూర్ధ్వపుణ్డ్రం ప్రయత్నతః ॥

---

రమ్ = సర్వేశ్వరుఁడును, సాంఖ్యయోగాభిగమ్యమ్ = సాంఖ్యయోగమువలననే పొందఁదగినవాఁడును అగు, నారాయణమ్ = విష్ణువును, జ్ఞాత్వా = తెలిసికొని, సమస్తైః = సకలములగు, సంసారపాశైః = సంసారబంధములచే, విముచ్యేత = విడువఁబడి, ఇహచేతి = ఇహలోకమునందే, విష్ణుమ్ = విష్ణువును, ('పొందును' అని అధ్యాహార్యము)

13. విద్వాన్ = పండితుఁడైన, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, లీలయాపి = విలాసముచేనైనను, త్రిపుణ్డ్రమ్ = త్రిపుండ్రమును, నధారయేత్ = ధరింపఁగూడదు, ప్రయత్నతః = ప్రయత్నముతో, సమ్యక్ = చక్కఁగా, ఊర్ధ్వపుణ్డ్రమ్ = ఊర్ధ్వపుండ్రమును, ధారయేత్ = ధరింపవలయును.

14. పాద్మే ॥ యే కణ్ఠలగ్నతులసీనలినాక్షమాలా
యేబాహుమూలపరిచిహ్నిత శఙ్ఖచక్రాః । యేవా
లలాటఫలకే లస దూర్ధ్వపుణ్డ్రా స్తేవైష్ణవాభువన
మాశు పవిత్రయన్తి ॥

15. శేషధర్మే ॥ శఙ్ఖచక్రాఙ్కితాన్భక్తాన్ యః ప్రాజ

---

14. పాద్మే ॥ యే = ఎవరు, కంఠలగ్నతులసీనలినాక్షమాలాః = కంఠమునందు తులసిపూసలయొక్కయు, తామరపూసలయొక్కయుమాలలుకలవారో. యే = ఎవరు, బాహుమూలపరిచిహ్నితశఙ్ఖచక్రాః = భుజములయందు శంఖచక్రముల చిహ్నములుకలవారో, యేవా = ఎవరైన, లలాటఫలకే = నొసటిప్రదేశమునందు, లసదూర్ధ్వపుణ్డ్రాః = ప్రకాశించెడు ఊర్ధ్వపుండ్రముకలవారో, తేవైష్ణవాః = ఆవైష్ణవులు, భువనమ్ = భూమిని, ఆశు = శీఘ్రముగా, పవిత్రయన్తి = పావనముసేయుదురు.

15. యఃమానవః = ఏమానవుఁడు, శఙ్ఖచక్రాఙ్కితాన్ = పంచసంస్కారసంపన్నులగు, భక్తాన్ = భక్తులను, పూజయతి = పూజించునో, సః = వాఁడు, సాక్షాద్విష్ణుసామీప్యమ్ =

యతి మానవః స సాక్షా ద్విష్ణుసాన్నిధ్యమ్ లభ
తేనాత్ర సంశయః ॥

16. చక్రాఙ్కితానాం నామాని యో వదే ద్భక్తిమా
న్నరః । సర్వపాప వినిర్ముక్త స్స యాతి పరమం
పదమ్ ॥

17. విష్ణుభక్తాయ విప్రాయ చక్రచిహ్నాయ మానవః ।

ప్రత్యక్షముగవిష్ణువు చేరువను, లభతే = పొందును, నాత్ర సంశ
యః = దీనికిసందేహము లేదు.

16. యఃభక్తిమాన్ నరః = ఏభక్తితోఁగూడిననరుఁడు, చక్రాఙ్కి
తానామ్ = చక్రచిహ్నములయొక్క, నామాని = నామ
ములను, వదేత్ = ఉచ్చరించునో, సః = వాఁడు, సర్వ
పాపవినిర్ముక్తః = సర్వదోషములచే విడువఁబడి, పరమం
పదమ్ = మోక్షపదవిని, యాతి = పొందును.

17. యఃమానవః = ఏమానవుఁడు, విష్ణుభక్తాయ = విష్ణుభక్తు
డైనట్టియు, చక్రచిహ్నాయ = చక్రాంకితుఁడైనట్టియు
విప్రాయ = బ్రాహ్మణునికి గోచర్మమాత్రమ్ = ఆవుతో
లంతటి భూమిని, దద్యాత్ = ఇచ్చునో, సతు = వాఁడు,

గోచర్మమాత్రమ్ యోదద్యా ద్భూమిం స్యా త్సతు రాజ్యభాక్ ॥

18. శ్రీభాగవతే ॥ హరిః పరాయణం పరం హరిః పరాయణం పరమ్ । పునః పున ర్వదా మ్యహం హరిః పరాయణంపరమ్ ॥

19. విష్ణుధర్మోత్తరే ॥ తస్మా త్సర్వేషు దేవేషు విష్ణురేవ సనాతనః। తస్మా త్సర్వప్రయత్నేన విష్ణు మేవ సమాశ్రయేత్ ॥

---

రాజ్యభాక్ = ప్రభుత్వము నొందినవాఁడుగా, స్యాత్ = అగును.

18. హరిఃపరాయణమ్ = విష్ణుధ్యానము, పరమ్ = సర్వోత్కృష్టము, (ఇట్లు) పునఃపునః = మాటిమాటికి, అహమ్ = నేను, వదామి = చెప్పుచున్నాఁడను.

19. సర్వేషుదేవేషు = అందఱుదేవతలలో, విష్ణురేవ = విష్ణువే, సనాతనః = పూర్వతముఁడు, తస్మాత్ = అందువలన, సర్వప్రయత్నేన = అన్నివిధములగు ప్రయత్నములచేతను విష్ణుమేవ = విష్ణువునే, సమాశ్రయేత్ = ఆశ్రయింపవలయును.

ఈప్రకారముగా కూరనాథుఁడు శతసహస్ర ప్రమాణం బులచే విష్ణుపరత్వమును, చక్రాదిధారణావశ్యకమును, పరబ్రహ్మసగుణత్వమును నిరూపింప యాదవప్రకాశకుఁడు విస్మయము చెంది నిరుత్తరుఁడై పోయి తనమఠము సేరి చేయునదెఱుఁగక సంశయావిష్టమానసుఁడై యుండెను. ఆరాత్రి వరదరాజస్వామి అతనికి స్వప్నమునందుఁ గనఁబడి యతని సంశయమును బోఁగొట్టి యతనికి రామానుజాచార్య పాదకమలములనాశ్రయించి మోక్షమును బొందుమని హితోపదేశము చేసెను. అంత మఱునాఁడు యాదవప్రకాశకుఁడు యతీంద్రునిమఠమునకుఁ బోయి యతనికిఁ బ్రదక్షిణపూర్వకంబుగా నమస్కారము సేసి యతనితో, "మహాప్రాజ్ఞా, గురువర్యా, నీపాదకమలముల నాశ్రయించిన నన్ను సంసారకూపమునుండి యుద్ధరింపుము." అని మొఱవెట్ట దయార్ద్రచిత్తుఁడు రామానుజాచార్యుఁ డతనికిఁ బంచసంస్కారము సేసి గోవిందదాసుం డనునామం బిడి తానే సకలవైష్ణవగ్రంథంబుల నుపదేశించి యంత నతనినిదివఱకు వైష్ణవసన్న్యాసులదూషించినదోషము పరిహరించునట్లుత్రిదండసన్న్యాసవిధుల బోధించు నొకగ్రంథ

మును యతిధర్మసముచ్చయమనుపేర రచింపుచునట్లు ప్రేరేపించెను. యాదవప్రకాశకుఁడు పిమ్మటఁ గొంతకాలము రామానుజార్యుని సన్నిధానమునందే యుండి పరమపదము నొందెను.

యామునాచార్య పుత్త్రిండగు తిరువరంగప్పెరుమాళరయరు రామానుజార్యుని శ్రీరంగమునకు దోడ్కొని పోవుట.

ఇట్లు తన్నుఁ జూచినవారికందఱకు నేత్రోత్సవము కావించుచు ఎల్లజనులయందును భక్తివైరాగ్యంబుల నభివృద్ధిసేయుచు లోకరంజకుండై రామానుజార్యుఁడు కాంచీపురంబున నివసించియుండ శ్రీరంగపురమునుండి రంగనాథు నన్నుజ్ఞచొప్పునయామునాచార్య పుత్త్రిండగు తిరువరంగప్పెరుమాళు కంచికేతెంచి తిరుకచ్చినంబి పురుషకారముచే వరదరాజస్వామిని నృత్తగానంబులచేఁ దృప్తిపఱిచి రామానుజార్యుని దనతో శ్రీరంగమునకుఁ బంపునట్లు వరంబు వడసి యంతఁగూరేశాది శిష్యపరివృతుండగు రామానుజార్యునితోఁ గూడఁ బయలుదేరి శ్రీరంగపట్టణము సేరెను. అంత తిరువరంగప్పెరుమాళు ముందుగాఁబోయి యాసంతోషవార్తను పెరియ

నంబికి జెప్ప నతఁడు స్వర్ణమయచ్ఛత్రచామరంబులతోను వేదపారకులతోను అనేకవైష్ణవబృందంబుతో నెదురుగాఁజను దేరఁ గాంచి రామానుజార్యుఁడు శిష్యులతోఁగూడ నా వైష్ణవశిఖామణుల కందఱకు సాగిలఁబడిమ్రొక్కి వారిఁ గూడి నిజగురుండగు పెరియనంబిని మరలఁజూడఁగలుగుట కానందించుచు రంగనాథాలయంబున కరిగి పెరియనంబిపు రుషకారముచే రంగనాథుని సేవించి యతని యెదుట బద్ధాంజలియై నిలిచియుండఁ బెరియనంబి రామానుజార్యునితో "పూర్వము శఠకోపముని అజ్ఞానులగుజనులను జూచి కరుణఁ జెంది వారిని భవబంధనిర్ముక్తులఁ గావింప వైకుంఠలోకము నుండి యవతరించి యాకార్య మప్పుడశక్యమని తెలిసికొని తనగ్రంథముననిట్లువ్రాసె? 'ఇఁకమీఁద నీలోకమున మహాపురుషుఁడొకఁడుపుట్టఁబోవుచున్నాఁడు. అతఁడునిస్సంశయముగా రక్షింపఁగలఁడు.' ఇట్లు సూచింపఁబడినమహాత్ముఁడు నీవని పండితులందఱు నిశ్చయించియున్నారు. రంగనాథస్వామి నీకు విభూతిద్వయము నిప్పుడే యిచ్చును. స్వామియాజ్ఞచొప్పున ఇక్కడనే వాసము సేయుము. ఈలోకమునం దలిజనులనందఱ

తని శ్రీమన్నారాయణుని పాదకమలములయం దనురక్తులుగఁ గావింపుము. అనేకవత్సరంబులు ఈలోకమునందే సుఖముగా నుండి జనులనందఱిని విశేషవైభవముతోఁ బరిపాలింపుము." అని చెప్ప రామానుజార్యుఁడు మరల రంగనాథునికి నమస్కరించి, "స్వామీ, మీరు నన్నేది చేయుమని యాజ్ఞాపింతురో నేను దానిని మాత్రము సేయువాఁడ" అని కృతనిశ్చయుఁ డాయెను. అంత పెరియనంబి రంగనాథశాసనంబుచేఁ దదీయధన కనకరత్న వాహనాంబరాభరణాది మండిత భాండాగార ముద్రికలన్నియు నతని యధీనంబులు సేసి యతనికి ఉడయవర్లు అనునామం బిడి దేవాలయంబున కతని బరిపాలకునిఁగా నియమింప రామానుజార్యుఁ డంత సేవకులనందఱిని రప్పించి వారికి తమతమకైంకర్యంబుల నతిశ్రద్ధతోను భక్తితోను జేయునట్లు హితోపదేశము చేసి యీప్రకారముగా రంగనాథకైంకర్యలోలుఁడై శ్రీరంగక్షేత్రంబున నుండెను.

**రామానుజార్యుఁడు గోష్ఠీపూర్ణునివలన తిరుమంత్రార్థంబును గ్రహించుట.**

అంత నొకనాఁడు రామానుజార్యుఁడు పెరియనంబియింటికిఁ బోయి యతనితో, "గురువర్యా, మీరు

నా యెడలఁ గృపచేసి నాకు విశేషార్థములను బ్రసాదించి నన్నుఁ గడతేర్పుఁడు" అనిచెప్పఁ బెరియనంబి యతనికి * శ్లో॥ అహో ద్వయస్య మాహాత్మ్య మహో వీర్య మహో బలమ్ । మంత్రరత్నం శుభకరం వేదసారం సనాతనమ్। సర్వపాపక్షయకరం సదా పుణ్యవివర్ధనం। శ్రీకరం లోకవశ్యఞ్చ సద్య స్సంసారతారకమ్ ॥ అనిచెప్పఁబడఁదగి అత్యంతమహిమగల ద్వయమంత్రమును సార్థకముగాను, న్యాసతత్త్వమును, గీతార్థసంగ్రహమను గ్రంథమును, సకల వ్యాససూత్రములను, ఉపదేశించి తనపుత్త్రుఁడగుపుండరీకాక్షుని రామానుజార్యునికి శిష్యుఁగాఁ గావించి 'సంతృప్తమనస్కుఁడై, యంత రామానుజార్యునికి గోష్ఠీపురమునందుండు యతిశ్రేష్ఠుండగు గోష్ఠీపూర్ణు (తిరుకోట్టియూర్ నంబి)

---

* ద్వయమంత్రముయొక్క మాహాత్మ్య మద్భుతము, అట్లే అది అత్యంతవీర్యమును బలమును గలది, మంత్రములలో నుత్తమమైనది, మంగళకరమైనది, వేదములయొక్క సారమైనది, ప్రాచీనమైనది, సర్వపాపములను నశింపఁజేయునది, ఎల్లప్పుడు పుణ్యమును వృద్ధిసేయునది, సంపత్కరమైనది లోకమును స్వాధీనము సేయునది, అప్పుడే సంసారమును దరింపఁజేయునది.

నాశ్రయించి యతనివలన సకలవిశేషార్థములను గ్రహింపు మని హితోపదేశము చేసెను. అంత సంప్రీతమనస్కుఁడై రామానుజార్యుఁడు గోష్ఠీపురంబునకుఁ బోయి తిరుక్కోట్టి యూరునంబినిఁ గాంచి నమస్కరించి యతనితో, "స్వామీ, దయానిధీ, నాకిప్పుడు తిరుమంత్రార్థము నుపదేశించి నన్ను రక్షింపుఁడు" అని వేడెను. గోష్ఠీపూర్ణుఁ డతనితో, "మంత్రార్థమున కధికారి యీలోకములోనే లేఁడే; నేను దానిని నీకెట్లుపదేశింతును?" అని చెప్పి విముఖుఁడై యుండఁ జూచి రామానుజార్యుఁడుమరలి శ్రీరంగమునకుఁ బోయెను. పిమ్మట కొన్నిదినములకు శ్రీరంగనాథ మహోత్సవముచూడ గోష్ఠీపూర్ణుఁడు శ్రీరంగమునకువచ్చి తీర్థశఠకోపములను గ్రహించుటకు రంగనాథాలయమునకుఁ బోవ నక్కడ స్వామి అర్చకోముఖముద్వారా అతనితో సర్వసద్గుణసంపన్నుఁడగు రామానుజార్యునికి మంత్రార్థము నుపదేశింపుమని చెప్పెను. అంత రామానుజార్యుఁడు తిరుగా గోష్ఠీపూర్ణునియొద్దకుఁ బోయి అతిభక్తివినయంబులతో మంత్రార్థమును ప్రార్థించెను. ఐన మరల గోష్ఠీపూర్ణుఁడు విముఖుఁ డాయెను. ఇట్లుపదునెని

మిదిసారులు గోష్ఠీపూర్ణు నాశ్రయించియు విఫలమనోర థుండై అతిదుఃఖితుండై స్వగృహము సేరెను. అంత నొక నాఁడు గోష్ఠీపురమునుండి యొక వైష్ణవోత్తముఁడు శ్రీరంగ క్షేత్రమునకుఁ బోయి యుండి యచ్చట మంత్రార్థమున కుఁగా నహర్నిశము పరితపించు లక్ష్మణార్యునిఁజూచి మరలి గోష్ఠీనగరంబునకుఁ బోయి గోష్ఠీపూర్ణునికి మంత్రార్థము విషయమున రామానుజార్యునికిఁగల ఆసక్తియు భక్తియు, మంత్రార్థమునకుఁగాను అతఁడుపడు దుఃఖమును విశదపఱిచెను. గోష్ఠీపూర్ణుఁడు పశ్చాత్తాపము నొంది తత్క్షణమే శిష్యునొకని నతిశీఘ్రముగ రామానుజార్యునిఁ బిలిచికొని రమ్మని శ్రీరంగక్షేత్రమునకుఁ బంప నాతఁడు పోయి రామానుజార్యుని పాదకమలములకు మ్రొక్కి యతనిచే సమ్మానింపబడి " యతీంద్రా, మిమ్ము గోష్ఠీపూర్ణులయొద్దకు బిలిచికొనిపోవుటకు వారిచేఁ బంపబడితిని. వారిప్పుడు మీకు మంత్రార్థము ననుగ్రహింతురు. మిమ్మును ఒంటరిగా దండపవిత్రములతో రమ్మని చెప్పిరి." అని నివేదించెను. లక్ష్మణార్యుఁడు సంతృప్తమనస్కుఁడై కూరనాథ దాశరథులతోఁ

గూడి గోష్ఠీపూర్ణు నొద్దకుఁ బోయి శిష్యులతోఁ గూడ నతని పాదకమలములకు నమస్కరించి యత్యంతామోదముతోఁ గూడినవాఁడై నిలిచి యుండెను. గోష్ఠీపూర్ణుఁడు శిష్యసహితుండగు రామానుజాచార్యునిజూచి, "మంత్రార్థ మతిగోప్యము. కాఁబట్టి శిష్యులతోఁ గూడవచ్చితివి కాన నీకిప్పుడది అలభ్యము." అన విని రామానుజార్యుఁడు గోష్ఠీపూర్ణునితో, "మీరు నన్ను త్రిదండపవిత్రములతో రమ్మని యాజ్ఞాపించితిరి. నాకు కూరేశుఁడు యజ్ఞోపవీతము, దాశరథి త్రిదండము, కాన వారిద్దఱితోఁ గూడ నేతెంచితిని" అని చెప్పెను. అంత నంబి వారిద్దఱికిఁ దక్క నొండొరుల కామంత్రము నుపదేశింపకుండునట్లు రామానుజార్యునివలన వాగ్దానమునొంది యతినికి, * "ప్రణవాద్యం నమోమధ్యం నారాయణపదాన్తిమమ్। మన్త్రిమష్టా

* మొదట ప్రణవము (ఓం)ను, నడుమ నమోఅనుశబ్దమును, కడపట నారాయణశబ్దమును గల అష్టాక్షరీమంత్రము దేవసంబంధమైనది, ఎల్లప్పుడు సకలకార్యములను నెఱవేర్చునది. మోక్షాపేక్షకులచే నెల్లప్పుడు జపింపఁబడి భుక్తిముక్తుల నిచ్చును: వైష్ణవులచే నెల్లప్పుడు జపింపఁబడి భక్తిజ్ఞానముల వృద్ధిసేయును.

క్షరం దివ్యం సర్వసిద్ధికరం సదా। ముముక్షూణాం సదా జప్యం భుక్తిముక్తిఫలప్రదమ్। వైష్ణవానాం, సదా జప్యం భక్తిజ్ఞానప్రవర్ధకమ్॥" అనిచెప్పఁదగిన మహిమగల అష్టాక్షరీమంత్రంబును విశేషార్థసహితంబుగ నుపదేశించెను.

అంత నొకనాఁడు గోష్ఠీపురంబున నృసింహస్వామి మహోత్సవమును దర్శించుట కనేకవైష్ణవోత్తము లేతెంచిరి. రామానుజార్యుఁడు వారలనందఱిని జూచి సంతృప్తమనస్కుఁడై వారలకందఱకు నంబి తనకుపదేశించినమంత్రరాజంబును విశేషార్థముతో నుపదేశించెను. ఆవృత్తాంతము విని తిరుకోట్టియూరునంబి రామానుజార్యుని రప్పించి యతనిని గుర్వాజ్ఞనుల్లంఘించుటచే నేమిఫలమని యడిగెను. అతఁడు నరకమని బదులుసెప్పెను. అంత నంబి యతనిని, "నీవీవిషయము నెఱిఁగియుండియు నేల నాయాజ్ఞనుల్లంఘించి నాచేనుపదేశింపఁబడిన విశేషార్థంబు నందఱికి వెదఁజల్లితివి?" అనియడిగెను. రామానుజార్యుఁడు, "స్వామీ, మీయాజ్ఞనుల్లంఘించుటచే నాకొక్కనికి నరకంబు. మీపాదకమలముల నాశ్రయించి వేనవేలుమంది ముక్తిని బొందునటు,

లుండ నాకొక్కనికి నరకప్రాప్తియని సంశయింపఁ దగునా?" అనిబదులు సెప్పెను. అంతతిరుక్కోట్టియూరు నంబి పరమానందభరితుఁడై రామానుజార్యునికి "ఎంబెరుమానార్" అను తిరునామంబొసంగి యతనిని, "ఎంబెరుమానార్, నీయధ్యవసాయమునకుఁ జాలమెచ్చితి. వైష్ణవమతమును బరిపాలించుటకు నీవ యర్హుఁడవు." అని ప్రశంసించి యతనికి సర్వగుహ్యతమంబై పరమరహస్యంబైన చరమశ్లోకార్థంబును బ్రసాదించి (శ్లో॥ * సర్వ ధర్మాన్పరిత్యజ్య మామేకం

* స్వర్గాదులగు నూర్ధ్వలోకములఁ బొందించు యజ్ఞయాగాద్యనేక సత్కర్మములను, అనేకపాపములను బరిహరించు కృచ్ఛ్రచాంద్రాయణాది ప్రాయశ్చిత్తకర్మములను, ఇవియునుంగాక మోక్షమును బొందుటకు సాధనములుగా నియమింపఁబడియున్న రాజయోగము, కర్మయోగము, జ్ఞానయోగము, మొదలగుసాధనవిశేషంబులను విడిచి సర్వపరిపూర్ణుఁడనగు నన్నొక్కనినే శరణముగ నాశ్రయింపుము. అనఁగా సత్కర్మములవలన నస్థిరమగు స్వర్గసుఖము కలుగునుగాని మోక్షము కలుగఁజాలదు. కాఁబట్టి పుణ్యపాపబంధములనుండి ముక్తిని గోరువాఁడు ఫలాపేక్షతో సత్కర్మములఁ జేయఁడు. ఐన. రాజయోగము, కర్మయోగము, జ్ఞానయోగము, ఇవి మోక్షసాధనములైనను వీనినిగూడఁ ద్యజింపవలసినదే. ఏలయన

శరణం వ్రజ । అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥ (ఇదిచరమశ్లోకము) దానిని భగవద్విముఖులగు నాస్తికుల కర్ణంబులు సోకనీక పోషించుకొనుమని నియమింప రామానుజార్యుఁడు మహాప్రసాదంబని గ్రహించి తదనుజ్ఞాతుండై శిష్యులతోఁగూడ శ్రీరంగక్షేత్రంబునకు బయలుదేరి పోయెను. అంత కూరనాథుఁడు చరమశ్లోకార్థమునకుఁగాను దన్నాశ్రయింప రామానుజార్యుఁడతనిచే సంవత్సర శుశ్రూషాసమంబుగ నిజగృహద్వారంబున మాసోపవాసంబు

---

వానిని నిర్విఘ్నముగ నేఱవేర్చుట మొదటికష్టము. నేఱవేర్చినపిమ్మట వానివలన మనుష్యుని కమానుషశక్తి కలుగుటచే నవి యహంకారాభివృద్ధికిఁ గారణములుకాన నీయహంకారము నణఁచివేయుట రెండవకష్టము. సర్వసత్ఫలములను భగవంతుని భక్తితో నాశ్రయించుటవలనఁ బొందఁగూడియుండ నట్టిదుస్తరమార్గముల నేల యవలంబింపవలయు. ఏమార్గమునవలంబించినను భగవంతుఁడిచ్చినఁగాని మనుజుఁడు ముక్తినిబొందలేఁడు కాన నచంచలభక్తితో సర్వేశ్వరు నాశ్రయించుటయే సర్వమంగళదాయకము. కాఁబట్టియే వైష్ణవమతమునందు భక్తిమార్గమునకు ప్రాముఖ్యమీయఁబడియె.) నే నిన్ను సర్వపాపములనుండి రక్షించి నీకు మోక్షమిత్తును, దుఃఖింపకుము.

చేయించి యతనికిఁ దదర్థం బుపదేశించెను. దాశరథి కూడఁ దదర్థంబు నపేక్షింప రామానుజార్యుఁడు గుర్వాజ్ఞ నుల్లంఘింపక యతనిని గోష్ఠీపూర్ణునొద్దకుఁ బంపెను. దాశరథి గోష్ఠీపూర్ణు నాఱుమాసంబు లాశ్రయించి తదనుజ్ఞవడసి మరలి రామానుజార్యునొద్ద కేతెంచి యతనివలనఁ దదర్థంబు గ్రహించి కృతార్థుండాయెను.

రామానుజార్యుఁడు అద్వైతియగు యజ్ఞమూర్తితో వాదించి జయము నొంది యతని వైష్ణవునిగావించుట.

ఇట్లు రామానుజార్యుఁడు శ్రీవిష్ణుకైంకర్యైక ధురీణుఁడై వైకుంఠంబున నాదిశేషువలె శ్రీరంగక్షేత్రంబున శిష్యపరివృతుండై వేంచేసియుండ యజ్ఞమూర్తి యను నొకవిద్వాంసుఁడు అద్వైతి యట్టహాసముతో నేతెంచి రామానుజార్యుని పాండిత్యమహిమవిని యతనితో శాస్త్రివాదము సేసి జయింప నపేక్షించి తన్మఠమున కేతెంచి నిజాభిలాషము రామానుజార్యునికిఁ దెలియబఱచి తానోడినరామానుజార్యునిమతము స్వీకరించునట్లు ప్రతిజ్ఞచేసెను. రామానుజార్యుఁడోడినగ్రంథత్యాజ్యము సేయునట్లు ప్రతిజ్ఞచేసెను. ఈ

ప్రకారము వారిద్దఱు ప్రతిజ్ఞాపూర్వకంబుగ వాదింపఁదొడఁగిరి.

ఇట్లు పదునేడుదినము లహోరాత్రములు వాదించియు యజ్ఞమూర్తిని జయింపఁజాలక రామానుజార్యుఁడు ఖిన్నుఁడై రాత్రి శ్రీరంగస్వామినిధ్యానించి నిద్రింప దయానిధి శ్రీరంగనాథుఁ డతనికి స్వప్నమునఁ గనఁబడి యతనితో, "నీవేల దుఃఖించెదవు. మహాత్ముఁడు యామునాచార్యునిచే రచియింపఁబడిన మాయావాద ఖండనమను నొక గ్రంథము కలదు. తత్సాహాయ్యంబున నీవుయజ్ఞమూర్తిని సులభంబుగ జయింపవచ్చును." అనిచెప్పియంతర్హితుఁడాయెను. రామానుజార్యుఁ డంత మేల్కాంచిప్రహృష్టాత్ముఁడై మఱునాఁడు దివ్యతేజస్సు మూర్తీభవించిన దేమోయనునట్లు నిజదేహకాంతి యజ్ఞమూర్తికన్నులమిఱుమిట్లు కొల్పుచుండ నేతెంచి యాతని కుయుక్తులనన్నిటినవలీలగా ఖండింప నతఁడు రామానుజార్యుని ప్రతిభావిశేషంబులఁ జూచి విస్మయావిష్టమానసుఁడై యతఁడు సామాన్యమానవుఁడు కాఁడనినిశ్చయించి యతనిపాదపద్మముల నాశ్రయిం

చెను. రామానుజార్యుఁడును వానికిఁ బంచసంస్కారము చేసి సకలద్రవిడప్రబంధముల నుపదేశించి అరుళాళప్పెరుమాళెంబెరుమానారను తిరునామంబిడి యతనికిఁ బ్రత్యేకముగ నొకమఠము నేర్పాటుచేసి యందుండ నియమించెను. అంతఁ గొన్ని దినములకుఁ గాంచీపురమునుండి యిద్దఱు వైష్ణవులు శ్రీరంగక్షేత్రమునకేతెంచి యచ్చట ఎంబెరుమానారుయొక్క మఠం బెద్దియనివిచారింప నచ్చటివారు వారితో ఎంబెరుమానారులు ఇద్దఱుకలరు, వారిలో మీరు కోరువారెవ్వరు? అనియడిగిరి. వారంత ఇలయాళ్వారని చెప్పరామానుజార్యునిమఠము తెలిసికొనిరి. ఈవృత్తాంతమువిని అరుళాళప్పెరుమాళరయరు స్వగురునికిఁ బోటిగా తానొక ప్రత్యేకమఠము నందుండుట అపచారంబని తానట్లు గురుద్రోహము చేసినందుకు శిక్షగా తనమఠమును తత్క్షణమే కాల్పించి యప్పటినుండి లక్ష్మణార్యసాన్నిధ్యంబుననే వాసము సేయుచుండెను.

### రామానుజార్యుఁడు తిరుమలకుంజనుట.

అనంతరము రామానుజార్యుఁడు తిరుమలనంబిని సేవింప నపేక్షించి వేంకటాచలమునకుఁబోయి యంజనాద్రి

శుసన్నిధియందుఁ దీర్థప్రసాదంబుల గ్రహించి తిరుమలనంబి యాజ్ఞచొప్పున వేంకటాచలంబున మూఁడుదినంబులు నిరాహారంబుగ నివసించి వేంకటేశునివలన విభూతిద్వయంబును బడసి యంత నాశైలరాజం బవరోహించి తదుపత్యకోర్వియందు శ్రీశైలపూర్ణుని సదనంబుననుండి యామహాత్ముని వలన విశిష్టాద్వైత మతానుసారంబగు రామాయణార్థంబు గ్రహించుచుండెను. ఇట్లుండ నొక్కనాఁడు తిరుమలనంబి యొక్కవనంబున లక్ష్మణార్యుఁడును గోవిందదాసుఁడు నుండ నచ్చట లక్ష్మణార్యుఁడొకసర్పముజిహ్వాయందు ముల్లుగ్రుచ్చు కొన్నందున బాధపడుచుండఁ జూచి యావిషయమును గోవిందార్యున కెఱిఁగింప గోవిందార్యుఁ డాసర్పమునోటఁ జేతినిజొప్పించియాముల్లు పెఱికివేసి యంత స్నానము సేసి నిరుపద్రవముగా గృహము సేరెను. సర్వసమయోగపారీణులును, భూతదయార్ద్రచిత్తులును, జగద్రక్షకులునగు గోవిందార్యుని వంటివారిని జూచినఁ గ్రూరజంతువులు మాత్రమేల కీడు సేయు? "సర్వం బ్రహ్మమయం జగత్" అనునధ్యవసాయముతో వర్తిల్లుచు శత్రువులనుగూడ మిత్రులతోసమాన

ము గ: జూచువారు బుద్ధికారణశక్తులు కలిగి స్వేచ్ఛావిహారులగు మానవులవలనఁ గీడుబొందిన నొందవలసినదే కాని సర్వేశ్వర శాసనంబుల నతిక్రమింప నేరని మూఢజంతువుల వలన నెట్టియాపదనుబొందరు.

రామానుజార్యుఁడు తిరుమలనంబి వలన శ్రీరామాయణంబునకు విశిష్టాద్వైత మతానుసారంబుగ పదునెనిమిదివిధంబులగు నర్థంబుల నొక్కవత్సరంబునకు గ్రహించి శ్రీరంగక్షేత్రంబునకుఁ బ్రయాణము సేయ నుద్యుక్తుఁడాయెను. అప్పుడు తిరుమలనంబి యతనితో, “నీకు నేనీయఁదగినది మఱేమున్నది?” అని చెప్ప రామానుజార్యుఁడు “మీరింక నాకేమి యియ్యవలయును? గోవిందుని నాకొసంగుఁడు” అని వేఁడి భ్రాతృసహితుండై శ్రీరంగక్షేత్రమునకు వచ్చువాఁడు మార్గంబున గోవిందుని ముఖంబు సూచి వివర్ణంబుగ నుంటఁ గాంచి పరేంగితజ్ఞుఁడు రామానుజార్యుఁడు తత్కారణంబు నూహించి గురువియోగంబును సహింపఁజాల కున్నాఁడు గోవిందదాసుఁడని తెలిసికొని యతనిఁ దిరుగ కొందఱి వైష్ణవులతోఁ దిరుమలకుఁ బంపివేసెను. గోవిందుఁడు తిరుమల

నంబి మందిరంబున కరుగఁ జూచి తిరుమలనంబి వానిమీఁదఁ గోపింప నతనిభార్య గోవిందునిఁ జూచి కరుణించి గోవిందుఁడు మార్గాయాసము నొందినవాఁడు కాన నతనికిఁ దీర్థప్రసాదంబుల నిత్తునని భర్తతో విన్నవింప నతఁడు విక్రయించిన పశువున కాహారమెవ్వరైన నిత్తురాయని యాక్షేపించెను. గోవిందుఁ డామాట విని నిరాశచేసికొని గురునందిశ్రమునకు నమస్కరించి కాంచీపురంబువంకఁ బోయెను. ఆవృత్తాంతమును విని రామానుజార్యుఁడు తిరుమలనంబి యొక్క జ్ఞానవిశేషంబును జూచి సంతోషించి గోవిందుని వెంటఁబెట్టికొని శ్రీరంగక్షేత్రంబునకుఁ బయనమైపోయెను.

తిరుమలనంబి గోవిందుని నిరాకరించి పంపివేయుట గోవిందుని మేలునకుఁగానే. తిరుమలనంబి తనవలన నేమేమి నేర్చికొనవలయునో దానినంతయుసమగ్రముగాఁ దెలిసికొన్న గోవిందుఁ డింకను దనయొద్ద నుండుట వ్యర్థమనియు, తన కన్న నెన్నింతలో యధికుఁడును మహాత్ముఁడునగు రామానుజార్యు నొద్దనుండుట వలన నతఁడనేక విషయంబులఁ దెలిసి కొనవచ్చుననియు నాలోచించి యతనిక్షేమము

కొలఁకే గోవిందుని దనయొద్ద నుంచుకొనక నిరాకరించి పంపి వేసెను. ఇదియునుంగాక రామానుజార్యుని, యోగ్యతయు నతనివలనఁ దనకుఁగలుగఁబోవు మేలును గుర్తెఱుఁగనేరక మాధ్యము వహించి గోవిందుఁడు తనమీఁది యనురాగమే ప్రధానంబుగా మరలవచ్చెనేయని తిరుమలనంబి యతని మీఁదఁ గోపము వహించెను.

అట్లు గోవిందునితోఁ గూడికొని శ్రీరంగక్షేత్రమ్ముఁ జేరి యచ్చట వైష్ణవోత్తములు గుంపులుగుంపులుగా నెదురుగా వచ్చి తన్నుఁ బరివేష్టించి తోడరా రామానుజార్యుఁడు మరల క్షేమంబుగ నిజమఠంబు సేరెను.

## గోవిందార్యుఁడు తుర్యాశ్రమమును స్వీకరించుట.

గోవిందుఁడు శ్రీరంగక్షేత్రంబున అన్నయగు రామానుజార్యుని గూడి యతనివలన విశేషార్థంబుల గ్రహించుచు యతిరాజ సాకామూలంబున నిజగురు వియోగదుఃఖవార్ధిని దరించి యానంద వార్ధిమగ్నుఁడై సుఖంబుండఁ గొన్నిదినంబుల కతనితల్లి ద్యుతిమతి వచ్చి యతనితో, “గోవిందా నీభార్య ఋతుమతియైనది. కాన నీవు భార్యనుగూడి సుఖం

పుము, రమ్ము." అనిచెప్ప గోవిందుఁడు, "రామానుజార్యుఁ డెట్లు భార్యను ద్యజించి సన్న్యాసాశ్రమము స్వీకరించెనో నేను నట్లు సేయుదును." అని చెప్పెను. ద్యుతిమతి యావృత్తాంతమును రామానుజార్యునితోఁ జెప్పి యెట్లయినఁ దన పుత్త్రుని దనతోఁ గూడఁ బంపుమని వేడెను. రామానుజార్యుఁడు గోవిందుని బిలిచి యతనితో. "గోవిందా, నీవు పోయి యంధకారసమయముగాఁ జూచి భార్యను గూడి సుఖింపుము" అని చెప్పి పంపెను. గోవిందుఁడు గుర్వాజ్ఞానుసారంబుగఁ దల్లితోఁ గూడఁ బోయి భార్యతోఁ దనశయ్యాగృహంబు ప్రవేశించియు జితమన్మథుఁడై విరక్తివహించి రాత్రియంతయు భార్యకు మోక్షమార్గంబును భక్తివైరాగ్యంబుల నుపదేశించుచుండెను. ద్యుతిమతి యావద్వృత్తాంతంబును గోడలివలన విని వైఫల్యమునొంది ఖిన్నయై యుండెను. రామానుజార్యుఁ డావార్త విని గోవిందుని రప్పించిమందస్మితవదనారవిందుఁడై యతనితో, గోవిందా, నేను నీతో నేమి చెప్పితిని? నీవేమి చేసితివి? చెప్పుము" అనియడుగ నాతఁడు "గురువర్యా, మీరు నన్నంధకారంబున భార్యను గూడుమని

చెప్పితిరి. జ్ఞానతేజోమయుండగు నంతరాత్మ యెల్లప్పుడు ప్రజ్వలించుచుండ నంధకారసమయమున . కవకాశమెట్లు కలుగు?॥ అని చెప్ప విని రామానుజార్యుఁడు పరమానంద భరితుఁ డాయెను. గోవిందుఁడును సన్న్యాసాశ్రమము స్వీకరించెను.

అనేకులు మనస్స్థైర్యము చాలనివారు వైరాగ్యమును బోధించు గ్రంథమును జదివినప్పుడు కాని, సంసారబాధలు దుస్సహంబు లైనప్పుడు కాని, లేక రామానుజార్యునివంటి మహాత్ముల సాంగత్యము తటస్థించినప్పుడు కాని, సంసారసుఖములయందు విరక్తిని బొంది తుర్యాశ్రమమును స్వీకరింతురు. వారే పిమ్మట సౌందర్యవతులగు యువతీమణులఁ జూడఁ దటస్థించినప్పుడు ఇంద్రియములకు లోఁబడుదురు. విషయ సౌఖ్యములు తుచ్ఛములని స్వానుభవముచేఁ దెలిసికొని వానియందు విరక్తిని బొందినవాఁడు కాక తాత్కాలిక వైరాగ్యసంపన్నులు తుర్యాశ్రమము స్వీకరింప ననర్హులని నిరూపించుటకై రామానుజార్యుఁడు గోవిందు నతనిభార్య యొద్దకుఁ బంపి పరీక్షించి చూచెను.

రామానుజార్యుఁడు శ్రీభాష్యాది గ్రంథముల రచించుట.

అంత రామానుజార్యుఁడు యామునముని యంతిమదశలో నతనికిఁ జేసిన వాగ్దానమును జ్ఞప్తికిఁ దెచ్చికొని శ్రీభాష్యమును రచింప నుద్యుక్తుఁడై కూరేశునితోఁ గూడి శారదాపీఠముచేరి యక్కడి సకలపండితులను శాస్త్రవాదమున జయించి శారదను దృప్తిపఱిచి యామెవలన బోధాయనసూత్రములను బహుమానముగా పొంది మరలి శ్రీరంగక్షేత్రమువంక వచ్చువాఁడు మార్గంబున శారదాపీఠవాసులు పండితులతని నడ్డగించి యా గ్రంథమును బలాత్కారముగా తీసికొని పోయిరి. అశేషభూభరంబును నిజఫణశాలిఁదాల్చు మహాబలుఁడా గ్రంథమును జోరులనుండి సంరక్షించుకోలేక పోయెనా? మానుషలీలఁబరగు నాయనంతుఁడు ప్రకృత్యైక లోలుఁడై దివ్యశక్తిని బయలుపఱుపక, శ్రీరామచంద్రుఁడు సీతావిహీనంబైన తనయాశ్రమంబును గాంచి తద్వియోగము భరింపనేరక ఎట్లు శోక సాగరమగ్నుఁడాయెనో, అట్లే పట్టిగాని దుఃఖము నొందెను. అట్లుదుఃఖించు గురువర్యుని జూచి కూరేశుఁడు, "మహాప్రాజ్ఞా, దుఃఖింపకుఁడు. నేనా

గ్రంథమునంతయు సమగ్రముగా రాత్రిఁజదివితిని. మీయ నుగ్రహంబున అదంతయు నామనంబుననే నిలిచియున్నది" అనిచెప్ప విని రామానుజాచార్యుఁడు సంతుష్టాంతరంగుఁడై కూరేశునిఁగూడి యతిత్వరితముగ శ్రీరంగక్షేత్రము సేరెను. అనంతరము రామానుజాచార్యుఁడొక్కనాఁడు కూరేశదాశరథ్యాది నిజశిష్యులను బిలిచి వారితో, "తత్త్వమస్యాది వాక్యార్థజ్ఞానమే మోక్షసాధనమనియు జ్ఞానకర్మసముచ్చయమువలనఁగూడ మోక్షమును బొందవచ్చుననియుఁ దలఁచు కుదృష్టుల యజ్ఞానాంధకారమును నిరసించుటకు, ధ్యానోపాసన శబ్దములయొక్క వేదాంతార్థమును స్పష్టీకరించునట్టిదియు, భక్తిరూపమును, ఉపాసనాత్మకమును, వేదాంతార్థ ప్రతిపాదకమునునగు గ్రంథమును శ్రీభాష్యమును రచింప నుద్యమించియున్నాఁడను" అని చెప్పెను. అందఱును ప్రహృష్టాత్ములై "అవశ్యము రచింపుఁడు" అని యేకగ్రీవముగా నుడివిరి. రామానుజార్యుఁడు కూరేశునిజూచి, "నేను జెప్పువాక్యముల నీవుచక్కఁగా పరిశీలించి నీకు రుచించిన వ్రాయుము; రుచింపనిచో నూరకుండుము." అని

చెప్పెను. కూరేశుఁడును వ్రాయఁ దొడఁగెను. కొంతగ్రంథమైన పిమ్మట, నొక్కచో రామానుజార్యుఁడు, విష్ణుశేషత్వరహిత జ్ఞాతృత్వ ప్రతిపాదకమగు నొకవాక్యమును జెప్పఁ గూరేశుఁడు వ్రాయక ఊరక కూర్చుండెను. మఱిమఱి చెప్పినను వ్రాయలేదు. రామానుజార్యుఁడు కుపితుఁడై కూరేశునితో, "భాష్యమును నీవే రచింపుము" అని చెప్పి లేచిపోయెను. దాశరథి మొదలగువారు కూరేశునితో, "గురువులు నీమీఁదఁ గోపించియున్నారు. నీవేల వారుచెప్పినట్లు వ్రాయకున్నాఁడవు?" అనిచెప్ప కూరేశుఁడు, "వారియాజ్ఞచొప్పున ప్రవర్తించితినిగాని వారియాజ్ఞను నేనతిక్రమింపలేదు" అనిమాఱు పలికెను. రామానుజార్యుఁడు తద్వాక్యార్థమును మరలఁ జక్కఁగానాలోచించి కూరేశుని మీఁదఁ బశ్చాత్తాపమునొంది వానిఁబిలిచి విష్ణుశేషత్వసహితజ్ఞాతృత్వ ప్రతిపాదకమగు వాక్యమును జెప్పఁ గూరేశుఁడు నతిసత్వరంబుగ వ్రాసెను.

రామానుజార్యుఁడు తనవెనుక గురుస్థానంబును బొందువారికొకనీతి నుపదేశించుటకై యిట్లుచేసెను. గురువులుగ

నుండువారు శిష్యులముందర సర్వజ్ఞత్వము నభినయింపఁగూడదు; శిష్యులయొక్క బుద్ధి స్వాతంత్ర్యము నభివృద్ధిసేయవలయు. తాము సెప్పినదంతయు తెలిసియో తెలియకయో పరిగ్రహించునట్లు శిష్యులను నిర్బంధింపఁగూడదు. తాము బోధించు విషయములలో వారికి యుక్తములగు వానిని గ్రహించి యయుక్తములగు వానిని విడువుఁడని శిష్యుల యొక్క బుద్ధిస్వాతంత్ర్యమును కారణశక్తి నభివృద్ధిసేయఁ జూడవలయునే కాని తాము సెప్పినవన్నియు వేదవాక్య సమానంబుగ గ్రాహ్యంబులని నొక్కి నక్కాణింపఁదగదు.

ఇట్లు వినాశేషుఁడు వ్రాయ రామానుజార్యుఁడు శ్రీభాష్యము, గీతాభాష్యము, వేదాంతదీపము, వేదాంతసారము, వేదార్థసంగ్రహము అను గ్రంథములను లోకోపకారార్థము శాస్త్రసమ్మతముగ రచించి యామునముని ఋణముతీర్చి కృతార్థుఁడాయెను.

రామానుజార్యుఁడు కురంగనగరీ పూర్ణునికి ద్వయమంత్రము నుపదేశించి యతనివలన బ్రహ్మరక్షంబువడయుట.

శ్రీరంగక్షేత్రంబున వైష్ణవోత్తములందఱు నొక్క నాఁడు రామానుజార్యునితో నమస్కారపూర్వకముగా.

"స్వామీ, గురువర్యా, మీరు శ్రీభాష్యాది దివ్యప్రబంధ ములరచించి, వైష్ణవమతమును సంస్థాపించితిరి. దానిని దశదిశలయందును వ్యాపింపఁజేసి యితర సిద్ధాంతములను ఖండించి దిగ్విజయముచేసి దివ్యదేశముల నన్నిటిని సేవించి రావలదా!" అనివిన్నవింప నావైష్ణవులకు రామానుజార్యుఁడు మృదుమధురవాక్యములతోఁ దనసమ్మతిని దెలియఁబఱిచి శ్రీరంగనాథస్వామియనుజ్ఞ వడసి నిజశిష్యులగు వైష్ణవోత్త ములు పరివేష్టించి కూడరా శ్రీరంగక్షేత్రము విడిచి చోళ మండలముచేరి కుంభఘోణాది దివ్యదేశములను సేవించి యక్కడి పండితవర్యులను శాస్త్రివాదమున నోడించి వారినిదనశిష్యులనుగాఁజేసికొని, పాండ్యదేశమంతయు ప్రవేశించి యచ్చటిదివ్యదేశములను సేవించి పండితుల జయించి వారిని స్వశిష్యభూతులఁగావించి, కురుకానగరము ప్రవేశించి యచ్చట శఠకోపమునీశ్వరుని నతిభక్తిపూర్వకంబుగా నమ స్కరించి తీర్థప్రసాదముల గ్రహించి సంతుష్టాంతరంగుఁడై యాయోగీంద్రునిమీఁద, "శ్లో॥ వకుళధవళమాలావక్షసం వేదబాహ్య ప్రబలసమయవాదచ్ఛేదినం పూజనీయం, విపుల

కురుకనాథం కారిసూనుం కపిశం శరణ ముపగతోஉహం చక్ర హస్తేభ చక్రమ్॥" అనుధ్యానశ్లోకము నురచించి, యంతబహు శిష్యపరివృతుండై కురంగనగరము చేరి కురంగనగరీపూర్ణుని దివ్యమంగళవిగ్రహమును జూచి సంతుష్టాంతరంగుండై యతి భక్తితో నమస్కరింప బహుసంఘ సమావృతునాయతిసార్వ భౌముని చూచి కురంగనగరీపూర్ణుఁడు "యోగీంద్రా, నేను లోకరక్షణార్థమై లక్ష్మితోఁ గూడ మునుపు రామకృష్ణాద్యవ తారరూపముగ నీలోకమున జన్మించి దుష్టనిగ్రహశిష్టపరి పాలన ధర్మసంస్థాపనంబులఁ గావించితిని. ఐన నా యవతా రముల యందంతయు ప్రాకృతజనుల దక్క నన్నొక ప్రాకృ తపురుషునివలె భావించిరి. వారిని నేను వశపఱచికొనలేక పోతిని. నీవేయుపాయముచే వీరినందఱిని వశపఱచికొంటివో నాకుఁ జెప్పుము." అనియడిగెను. లక్ష్మణార్యుఁడు, "దాని నడుగవలసినక్రమమున నడిగిన నేనును దానినిప్పుడ చెప్ప దను." అని మాఱువలికెను. కురంగనగరీపూర్ణుఁడు తత్క్ష ణమే రత్నకంబళిచేఁ గప్పఁబడి ప్రకాశించుసింహాసనమును లక్ష్మణార్యుని కొసఁగి తానుభక్తియుక్తుఁడై క్రిందఁగూరు

చుండెను. రామానుజార్యుఁ డాతనికుడిచెవిలో, "సకృత్స్మరణమాత్రేణ దదాతిపరమంపదమ్" అనిచెప్పఁదగినమహిమకలిగినమంత్రరత్నంబగు ద్వయమంత్రము నుపదేశించెను. పూర్ణనాముఁడగు సాక్షాచ్ఛ్రీమహావిష్ణువు సంప్రీతమనస్కుఁడై రామానుజార్యుని బ్రహ్మరథంబునఁ గూర్చుండఁబెట్టి శ్లాఘించెను.

ఇందువలన మనము తెలిసికొనవలసిన ధర్మమేమన, ఒకవిశేషార్థమునకై గురువు నాశ్రయించునప్పుడు ఇతర విషయములయందు మనమధికారము వహించియున్నామని యహంభావమువహింపక మన మెంతధనసంపత్తియు విద్యాసంపత్తియుఁ గలవారమైన నాసమయంబున భక్తివినయంబులతో వర్తింపవలయును. శ్రీమహావిష్ణువు ద్వయమంత్రప్రభావము నెఱుఁగకయా రామానుజార్యునివలన నుపదేశమునొందెను? శ్రీమన్నారాయణుని యనుజ్ఞవడసియేకదా ఆదిశేషువు జగద్రక్షణార్థ మీలోకమున నవతరించె. ఐన గురువు నాశ్రయింపవలసిన మార్గమును జనులకు నిరూపించుటకును, ద్వయమంత్రప్రభావమును సమగ్రముగ లోకము

నకు తెలియఁజేయుటకును, తానే యూశ్రయించుటచే రామానుజార్యుఁ డెట్టివారికైన నాశ్రయార్హుఁడని ప్రకటించుటకును నారాయణుం డట్టిలీలఁ గావించె.

రామానుజార్యుఁ డంత సింహాసనము దిగి బద్ధాంజలియై కురంగనగరీపూర్ణునియెదుట నిలిచి, "ఓపురుషోత్తమా, నాయపచారములనన్నిటిని క్షమింపుఁడు." అనివిన్నవించి శ్రీహరియనుజ్ఞవడసి కురంగనగరమునుండి కేరళమండలమువంక బయలుదేరెను.

రామానుజార్యుఁడు కప్యాసశ్రుత్యర్థమును వచించి శారదవలన శ్రీభాష్యకారుఁడను బిరుదనామంబు వడయుట.

కేరళమండలము సేరి రామానుజార్యుఁడు విష్ణుస్థలమునకు నమస్కరించి యక్కడి పండితశ్రేష్ఠులను శాస్త్రివాదంబున జయించి యచ్చటఁ దనపేర నొకమఠమును గట్టించి యక్కడినుండి బయలుదేరి ద్వారావతి, మథుర, సాకేతము, బదరికాశ్రమము, నైమిశము, పుష్కరము, బృందావనము, మొదలగు దివ్యదేశములను సేవించుచు నక్కడి పండితేనర్యుల నద్వైతుల శాస్త్రివాదంబున నోడించుచు వచ్చి

శారదాపీఠము సేరెను. అక్కడ శారద రామానుజార్యుని కప్యాసశ్రుతి తాత్పర్యమును జెప్పుమని యడిగెను. రామానుజార్యుఁడు, "ఓ శారదా, దానియర్థము సెప్పెదను వినుము. కం = జలము, దానిని ద్రాగువాఁడు కపి = సూర్యుఁడు, వాని కిరణములవలన వికసించునది, కప్యాసమ్ = పద్మమ్" అనిచెప్ప శారద సంతుష్టాంతరంగయై యతనికి శ్రీభాష్యకారుఁడను బిరుద నామంబొసంగి తద్విరచితమైన శ్రీభాష్యమును శిరముమీఁదనుంచికొని యతని కరమును బట్టికొని యతనిని బహువిధంబుల గౌరవించెను. రామానుజార్యుఁడక్కడి యద్వైత విద్వాంసులనందఱిని శాస్త్రవాదమున నోడింప వారుపలాయితులైరి. ఆవృత్తాంతమునంతయు నాపట్టణమురాజు విని తత్క్షణమే రామానుజార్యుని పాదముల నాశ్రయించెను. రామానుజార్యునికోడిపోయిన పండితవర్యులందఱునుగూడి, యా రామానుజార్యునికొఱకు *అభిచారము సేసిరి.

* హింసార్థమై సేయు హోమకర్మము.

ఆయభిచారమువలన రామానుజార్యున కేమియు బాధనొం
దలేదు. ఆపండితులే వీధివీధియందును గ్రహపీడితుల
వలె అవాచ్యములఁబలుకుచుఁ బరుగెత్తసాగిరి. ఆయూరి
రాజిదంతయుఁజూచి రామానుజార్యుని పాదకమలముల నా
శ్రయించి పండితులను రక్షింపుమని ప్రార్థించెను. రామా
నుజార్యుఁడు ననుగ్రహించెను. పండితులందఱు మదమా
త్సర్యముల విడిచి రామానుజార్యునికి శిష్యులైరి.

అనంతరము యతీంద్రుడు కాశికిఁ బోయి గంగా
స్నానమాచరించి భోగిశయనుఁడగు హరిని సేవించి యక్కడి
పండితశ్రేష్ఠుల నందఱిని జయించి యంత నక్కడనుండి
బయలుదేరి జగన్నాథక్షేత్రము సేరెను. జగన్నాథస్వామి
యాలయంబున శ్రీరంగాదిదక్షిణపుణ్యక్షేత్రంబులయందు
వలె అర్చనాదిక్రియలు సలక్షణముగా జరుగకుంటఁ గాంచి
యాదేవాలయంబును సంస్కరింపఁదలంచి రాజాజ్ఞనడసి
తనయుద్యమమునకుఁ దోడ్పడ భగవంతుని ధ్యానించి పరుం
డి నిద్రబోయి మేల్కాంచునప్పటికి శ్రీకూర్మక్షేత్రంబున.

నుండెను. ఆదైవకృత్యంబునకు విస్మయము చెంది తాన ప్పుడుండినది శ్రీకూర్మక్షేత్రమని తెలిసికొని యచ్చట శ్వేత మృత్తిక దొరకనందునను విష్ణ్వర్చనము సాధ్యపడనందునను యాదినమంతయు నిరాహారముగఁగడప నుద్యమించి యుం డెను; కాని శ్రీకూర్మనాయకుఁ డతనికి స్వప్నమునఁబ్రసన్నుఁ డై తానువాస్తవముగ హరియనియు తన్ను మాయాంధీ కృతలోచనులు శివునిగ భావింతురనియు శ్వేతమృత్తిక తన యాలయముమీఁద దొరకుననియు దానిని గ్రహించి యూ ర్ధ్వపుండ్రముల ధరించి తనకు భక్తితో నైవేద్యమును సమర్పించి నివేదితాన్నమును భుజింపుమని యుపదేశించి యంతర్ధానము నొందెను. రామానుజార్యుఁడు మేల్కాంచి సంతుష్టాంతరంగుఁడై శ్రీకూర్మనాయకాజ్ఞానుసారంబుగ ఊ ర్ధ్వపుండ్రముధరించి దేవతారాధనము సేసినివేదితాన్నమును భుజించెను. అప్పటినుండి శ్రీకూర్మము విష్ణుస్థలమని ప్రసిద్ధి నొందియున్నది. శ్రీకూర్మవాసులందఱు పుత్త్రదారాది సహితంబుగ యతీంద్రు నాశ్రయించిరి. యతిశేఖరుం డంత సింహాచలము అహోబిలము మొదలగు పుణ్యక్షేత్రముల

సేవించుచు వేంకటాచలము సేరెను. అచ్చట విష్ణువు శంఖచక్ర రహితుండుగ నుండ నాతని శైవులందఱు శివుఁడని యారాధించుచుండిరి. తన్మూలమున శైవులకును, వైష్ణవులకును కలహము సంభవించి యుండెను. అప్పుడు రామానుజార్యుఁడు శైవులను బిలిచి, "ఈక్షేత్రము విష్ణుక్షేత్రమనియు ఈదైవము విష్ణువనియు వైష్ణవులవాదము, మీరు శివుఁడని వాదింపుదురు. ఈకలహము నివర్తియగుటకు నే నొకయుపాయము' సెప్పెద వినుఁడు. విష్ణ్వాయుధంబులను శివాయుధంబులనుగూడ గర్భగృహంబున స్వామిసన్నిధియందుంచి రాత్రి కవాటమును బంధించి యుంతము, విష్ణువైన శంఖచక్రాదులను ధరించును, శివుఁడైన త్రిశూలాదులను ధరించును." అనిచెప్ప శైవులును దానికి సమ్మతించిరి. రామానుజార్యుఁడు నట్లుసేయ వేంకటేశస్వామియు శంఖచక్రముల ధరించి ప్రాతఃకాలమున ఉదయించుచున్న ప్రభాకరునితిరస్కరించు దివ్యతేజస్సుతో సకలవైష్ణవ హృదయకమలముల కపరిమితామోదము గావించెను. శైవులు విషణ్ణహృదయులై పారిపోయిరి. రామానుజార్యుఁడు స్థల

సంరక్షణమునకుఁగా నిద్దఱసన్న్యాసుల నియమించియచ్చట నుండి బయలుదేరి మధురాంతక వీరనారాయణపురాది దివ్యక్షేత్రంబుల సేవించి యిట్లు ప్రదక్షిణముకావించి పరమానంద భరితుఁడై మరల శ్రీరంగక్షేత్రము సేరెను.

కూరత్తాళ్వాన్ పుత్త్రులగు శ్రీపరాశరవ్యాస భట్టరుల వైభవము.

రామానుజార్యుఁడు యామునమునిచరమదశ యందతనితోఁ జేసిన మూఁడుప్రతిజ్ఞలలో 'రెంటిని' నెఱవేర్చి మూఁడవదానిని గూడ నెఱవేర్చుటకుఁ దలఁచియుండెను. అప్పుడు కాంచీపురికిఁ బశ్చిమమున ఒకక్రోశముదూరమున కూరముఅని యొకయగ్రహారముకలదు. అందు ధనసంపత్తిని గుబేరు నతికరించుచు కూరనాథుఁడను నొకబ్రాహ్మణోత్తముఁ డుండెను. అతఁడు సర్వదా అన్నదానపరాయణుఁడగుటం జేసి యాతనిగృహ మర్ధరాత్రిపర్యంతము పంగ్వంధకృపణాదుల కాశ్రయంబై యుండు. ఒకనాఁడురాత్రి అన్నదానాంతరము తద్గృహ కవాటమునుమూయుటచేఁ గలిగిన మేఘనాదసమంబగు శబ్దంబును గంచియందు లక్ష్మి విని

తత్కారణంబు వరదరాజస్వామివలన నెఱింగి యంతఁ గూర
నాథుని జూడ నత్యంతాభిలాషము మనంబున నుప్పతిల్లఁగాన
తత్క్షణము తిరుకచ్చినంబిని కూరనాథుని బిలిచికొన్ని రమ్మ
నిపంపెను. తిరుకచ్చినంబి పోయి కూరనాథుచే భక్తిపూ
ర్వకంబుగ పూజితుండై తనయుద్యమమును దెలుపఁ గూ
రనాథుఁడు, "కృతఘ్నుఁడను. మత్సానియు, పాపిష్ఠుఁడ నగు
నే నెక్కడ! నారాయణప్రియ బ్రహ్మరుద్రాదివందితయగు
జగన్మాత యెక్కడ! ఎవరియొక్క అపాంగసూక్ష్మోన్మేష
మువలన సర్వలోకసృష్టి స్థితిలయంబులుకలుగునో అట్టిలో
కజనినిని నేనుజూడఁదగుదునా?" అని కరంబులు మోడ్చి
లక్ష్మిని అతిభక్తి వినయ పూర్వకంబుగా ప్రశంసించి ధ్యా
నించి యంత సర్వస్వమును బీదసాదలకు దానము సేసి
శ్రీరంగయాత్రకు బయలుదేరెను. అప్పు డతనిభార్య ఆం
డాళమ్మ భర్తకు పాలుత్రాగుట కొకబంగారుగిన్నెనుదాచి
యెత్తుకొని పోవుచుండెను; మార్గమున నిర్జనారణ్యంబునఁ
బోవునప్పుడు ఆండాళమ్మ భర్తను జూచి తనకుదొంగలభ
యముకలుగుచున్నదని మొఱవెట్టెను. కూరనాథుఁడు,

"భయమునకు కారణము ధనము. ధనము లేకున్న దొం గలవలని భయముండదు. కావున నీయొద్ద తప్పక ధనము న్నది." అని నొక్కిచెప్పెను. ఆండాళమ్మ అంత నాబం గారుగిన్నె నెత్తి భర్తకు చూపి దీనిని మీకు పాలుద్రాగు టకు తెచ్చితినని చెప్పెను. కూరనాథుఁడది భయమునకు కారణమైనది కాన నవశ్యత్యాజ్యంబని దానిని మార్గంబు నఁ బడవైచెను. ఇట్లు పయనమైపోయి శ్రీరంగక్షేత్రము సేరి శ్రీరామానుజపాదకమలంబుల నాశ్రయించి యతని మన్నన వడసి ఉంఛవృత్తియందు కాలము గడపుచుండెను. ఒకనాఁడు సాయంకాలము ధారాసంపాతముగ వర్షము కురిసి కూరనాథుఁడు బయటికిపోయి అన్నము సంపాదించు కొనుటకు కాలాతీతమైనందున నాటిరాత్రి వారుభార్యాభ ర్తలు పస్తుపడియుండిరి. ఇట్లుండ కొంతకాలంబునకు దేవా లయమునుండి కాహళీ నినాదము వినవచ్చి నైవేద్యసమయ మును సూచించెను. అప్పుడా ఆండాళమ్మతనమనంబున భర్త ల్లు పస్తుండ భక్తవత్సలుఁడు నారాయణుఁడు శ్రీరంగనా థుఁడు భుజింపఁదగునాయని వితర్కించెను. శ్రీరంగనాథస్వామి

యంతట ఉత్తమనంబికి స్వప్నంబున శర్కరాజ్యసహితమగు నన్నంబును ఛత్రచామర వాద్యంబులతో తీసికొనిపోయి కూరనాథుని కర్పించుమని తెలుప నతండు మేల్కాంచి దైవాజ్ఞను సారంబుగ మహాపరిభవంబుతో అన్నంబును కూరనాథునింటికిఁ గొనిపోయి యతనిముందట నునిచి శ్రీరంగనాథునాజ్ఞను దెలుప నాతఁడు విస్మయావిష్టమానసుఁడై సర్వేశ్వరుఁడిదివఱకేతనకుసకలాభీష్టములనొసఁగెనే తనకీయన్నంబేల యని చెప్పి భార్యవంకఁ జూచి నీవేమైన నపేక్షించితివాయని యడుగ నామె తనమనంబున తలఁచినతలఁపును తెలిపెను. కూరనాథుఁడంత నాయన్నంబు నంతయు భార్యకే యొసఁగ నామె దానిని భుజించి గర్భిణియై పూర్ణచంద్రసమానులగు నిద్దఱుకుమారులఁ గాంచె. కూరనాథుఁడు తనకేమియు స్వాతంత్ర్యము లేదని యూరకుండెను. రామానుజార్యుఁడావార్త విని కుశలవులవలె సుందరులును దివ్యలక్షణలక్షితులును కూరకులదీపికులు నగునాకుమారకులఁగాంచి పరమానందభరితుఁడై వారిలో జ్యేష్ఠునికి పరాశరమహర్షిపేర పరాశరభట్టరనియు, రెండవ

వానికి వ్యాసమహర్షి పేర వ్యాసభట్టరనియు నామం బిడి యామునమునియభీష్టంబుపూర్తిచేసి కృతార్థుండాయెను. కూరనాథుఁడు వారుభగవదనుగ్రహంబునఁ బుట్టినవారుకావునను తానుపుత్త్రులనపేక్షింపనందునను వారిని బోషించుభారము దేవునిదికాని తనదికాదని యుదాసీనుఁడై యుండినందున రామానుజార్యుఁడు వారినిద్దఱిని శ్రీరంగరాజాలయంబునఁ జేర్పింప వారిద్దఱునచ్చట దినదినప్రవర్థమానులై భగవత్పుత్త్రులని సర్వజనులకు భక్తిపాత్రులై భక్తులహృదయకమలంబుల నలంకరించుచుఁ బెరుగుచుండిరి.

ఇట్లైదాఱుసంవత్సరంబులు కాఁగా ఒకనాఁడు శ్రీపరాశరభట్టార్య జన్మనక్షత్రమహోత్సవమున నాబాలుఁడు నమ్మాళ్వారుచే విరచింపఁబడిన ప్రబంధరాజంబును బఠించుచున్న తనతండ్రిఁ గూరేశుని, “నాయనా, శఠకోపరచిత ప్రబంధమున మహత్వాణుత్వములకు ఏకవస్తువాచిత్వము చెప్పఁబడియున్నవి. పరస్పరవిరుద్ధములగు వానికట్టి సంబంధమెట్లుకలుఁగును? తేజస్తమసంబులకు సామానాధి

కరణ్యము చెప్పనగునా?" అనియడిగెను. కూరేశుఁడు యుక్తియుక్తంబులగు నిజపుత్త్రివాక్యంబులు విని హర్షోత్కర్షపులకితాంతరంగుఁడై, "నీవు ఉపనీతుఁడవుకావుకాన వేదమును వినఁగూడదు. నీప్రశ్నకుఉత్తరము వేదాంతర్గతమైయున్నది. కాన నీకు నేనిప్పుడు బదులుసెప్పఁజాల" అని మాఱువలికెను.

మఱియొకనాఁడు పరాశరభట్టర్ వీథియందుబాలురతోఁగూడి యాటలాడుచుండఁగా కాహళీరవమువిని యది సర్వజ్ఞభట్టుఁడను బిరుదనామముధరించిన పండితోత్తముని రాకకుసూచితమని తెలిసికొని యంత నాబాలుఁడు అట్టహాసమ్ముగ వచ్చు సర్వజ్ఞభట్టునెదుటికి త్రోసికొనిపోయి యతనిని, "నీవు సర్వజ్ఞుఁడవఁట. నీకుఁ దెలియనివిషయము లేదఁట. ఈయిసుక ఎంతో చెప్పఁగలవా? అని దోసిటినిండ ఇసుక యెత్తి అడిగెను. సర్వజ్ఞభట్టుఁడు తెనవలనఁగాదని చెప్ప నంతపరాశరభట్టరు పిడికెటసిసుక యెత్తిఇదియెంతో చెప్పమనియడిగెను. సర్వజ్ఞభట్టుఁడుబాలునిధైర్యస్థైర్యంబులఁ

జూచి యచ్చెరువంది మాఱుపలుకు లేక భ్రాన్తుడైయుండెను. బాలుఁడంత అదిదో సెడసినయు సిదిపిడికెడనిధియు నీకు తెలియకపోయెనుగా అని సర్వజ్ఞభట్టుని దూలనాడెను. సర్వజ్ఞభట్టుఁడు బాలునిప్రతిభావిశేషంబులఁ జూచి విస్మయము చెంది యతనిని దనతోఁగూడ పల్లకియందుంచుకొని యతనితండ్రియొద్దఁ జేర్చి తండ్రితో ఇట్టి పుత్త్రిరత్నంబు నీకుఁగలుగుటచే నీజన్మంబు పావనంబయ్యె. ఇట్టికులదీపకుని గడసిన నీభాగ్యం బేమనవచ్చు! అని ప్రశంసించి కూరనాథుని వీడ్కొనిచనియె.

## మారనేర్ నంబి ప్రభావము.

మారనేర్ నంబి పంచమకులస్థుఁడయ్యు పరమభాగవతోత్తములలోనొకఁడు. ఇతనియొక్కజాతి హీనంబయ్యు గుణశీలంబులు శ్లాఘ్యంబులై యుంటంజేసి యామునముని యితనిని శిష్యునిగా పరిగ్రహించి పంచసంస్కారసంపన్నుఁగావించె. ఇతఁడు శ్రీరంగపట్టణబాహ్యప్రదేశంబున కావేరీతీరంబున నొకకుటీరంబున నివసించుచుండె. పురాకృతకర్మ

పరిపాకంబున నతనికి రాచపుండుకలిగి దాని చేదుస్సహంబగు బాధసంప్రాప్తమయ్యె. ఐన నతఁడుదానినంతయు సహించుచు శ్రీరంగనాథుని మనసాస్మరించుచు తనయందలి కరుణచే నిజగురు నధ్యవసాయంబెఱింగిన పెరియనంబి తెచ్చియిచ్చిన రంగనాథనివేదితాన్నమును భుజించుచు గాలము కడపుచుండె. ఆవ్రణముబలమై మారనేర్నంబిపరాధీనుఁడు కాఁగా పెరియనంబి ప్రతిదినమర్ధరాత్రంబున వచ్చి యాపుండుకడిగి కట్టుకట్టి యతనికి సమస్తోపచారములను జేసి పోవుచుండెను. ఈవిషయమును సూక్ష్మముగానెఱిఁగి రామానుజార్యుఁడు ఒకదినము మేలుకొనియుండి అర్ధరాత్రియందు పెరియనంబిని వెంటనంటిపోయి యతఁడు మారనేర్నంబికి చేయునుపచారంబులఁగాంచి సంతుష్టాంతరంగుఁడై మారనేర్నంబియొక్క బాధను జూచి సహింపలేక శోకముచే నిట్టూర్పువిడువ నావిషయము నప్పుడేకనుఁగొని మారనేర్నంబి నావిషయమున సర్వశేషి సేయుమేలును సహింపలేనివారెవరో తెలియదు. అనియెలుఁగెత్తిచెప్ప రామానుజార్యుఁడు ఎదుటవచ్చి మారనేర్నంబిని శ్లాఘించి య

తనిభక్తినిజూచి యానందించెను. వచ్చినవారు ఇలయాళ్వా ర్లనియె టింగిమారనేర్నంబితానుధన్యుఁ డనైతినని తలంచి కొంతసేపటికి పరమపదమునొందెను. అంత నాతనికి పెరియనంబియుత్తరక్రియలనిర్వర్తించి స్వగృహంబు సేరెను. అప్పుడు రామానుజార్యుఁడు పెరియనంబిని జూచి, "స్వామీ! అతఁడు పంచముఁడాయెనే, అతనిని స్పృశించి సమస్తవిధముల నుపచరించుట, రంగనాథ నివేదితాన్నము నతనికొసంగుట, అతనికి దహనాద్యుత్తరక్రియలనిర్వర్తించుట, తగునా?" అనియడిగెను. పెరియనంబియు, "రామానుజార్యా, నీకుఁదెలియనివిషయములేదు, తెలియనివానివలె నేలనన్నడుగవలయు? చక్రవర్తిప్రవరుండగు శ్రీరామచంద్రుఁడు జటాయువునకు దహనసంస్కారంబులు గావింపలేదా? నేనా సర్వశేషికన్న నధికుఁడనా? ఈభాగవతోత్తముఁడాపక్షికన్నహీనుఁడా?" అనిబదులుసెప్ప రామానుజార్యుఁడు సంతుష్టాంతరంగుఁడాయెను.

రామానుజార్యుఁడు ధనుర్దాసు ననుగ్రహించి యతనియందు విష్ణుభక్తియు తత్త్వచింతయుఁ గలిగించుట.

నిచుళానగరమునందు ధనుర్దాసుండను మల్లవర్యుఁడు మహాబలవంతుఁ డుండెను. అతఁడు తనభార్యయగు పొన్నాచ్చియను సుందరియందు బద్ధానురాగుఁడై యెల్లప్పుడు పూర్ణచంద్రునిబోలిన తన్ముఖంబును పద్మపత్త్రంబుల నతికరించు తన్నేత్రంబులను జూచి యానందించుచుండు. వీరిద్దఱు రంగనాథోత్సవమును దర్శించుటకు శ్రీరంగక్షేత్రంబునకుఁబోయి యుండి యచ్చట నొకనాఁడు ప్రాతఃకాలమున కావేరికిఁబోయి స్నానము సేసి వచ్చువారు అప్పుడు సూర్యకిరణంబులు తీక్ష్ణముగా ప్రసరింప ధనుర్దాసుండు తనపైవస్త్రమును సూర్యకిరణములు భార్య ముఖముమీఁద సోకకుండునట్లు లడ్డముగా పట్టుకొని పోవుచుండెను. అప్పుడు శిష్యపరివృతుఁడై కావేరియందు స్నానము సేసి వచ్చు రామానుజార్యుఁడు ధనుర్దాసుని జూచి వాని యజ్ఞానమును జూచి వ్యాకులమునొంది తనమనంబున, "ఇతఁడు

ప్రస్తుతము మదనాతురుఁడై యున్నను బుద్ధిస్థైర్యముకలవాఁడు, తదేకనిష్ఠాగరిష్ఠుఁడు. "కాకున్న చూచువారు నవ్వుదురని సిగ్గుపడక ఇతఁడు తనభార్య నిట్లుపచరించునా? ఇతఁడు భార్యయందు గాఢానురాగముగలవాఁడు, భార్యవలననే తనకు సకలసుఖములును గలుగుననినమ్మినవాఁడు. కాన తదితరములను తృణప్రాయములుగ జూచుచున్నాఁడు. ఇతనియందు విష్ణుభక్తిని గలిగించిన ఇతని కితర సకలవిషయములయందును అరుచికలుగును." అని యాలోచించి ధనుర్దాసుని తనయొద్దకు పిలచి, "నీయూరెద్ది, నీ పేరేమి? అనియడిగెను. అతఁ డంజలిబద్ధుండై, "స్వామీ, నేను నిచుళాపట్టణవాసిని, మల్లుఁడను. నాపేరుధనుర్దాసుఁడు" అనిచెప్పెను. రామానుజార్యుఁడు, "నీవు పౌరుషము విడనాడి యేల ఇల్లుసిగ్గుమాలి యందఱిముందర నీభార్య నుపచరించుచున్నాఁడవు? " అనియడిగెను. ధనుర్దాసుఁడు, "స్వామీ, నాభార్యయొక్క నేత్రపద్మంబులు నాకెల్లప్పుడు హృదయానంద జనకంబులు. వానిమీఁద సూర్యకిరణంబులు సోకి యవివాడునో యనుభయంబున నేనునావస్త్రం

బును వానికడ్డము పట్టితిని". అని నివేదించెను. రామాను జార్యుఁడు, "ధనుర్దాసా, నీభార్యనేత్రంబులు, పద్మపత్రసదృశంబులై హృదయరంజకంబులై యున్నను క్షణభంగురంబులు. కాన నిట్టివానివలనఁ గలుగునానందంబు నిత్యంబు కానేరదు. నిత్యానందజనకంబులగు పుండరీకాక్షుని నేత్రపద్మంబుల సేవింతువు రమ్ము." అనిపిలువ బదరీనారాయణమునివలె తేజోరాశియైన యతీంద్రుని జూచి ధనుర్దాసుఁడు పరమానందభరితుఁడై యతని యాజ్ఞను శిరసావహించి యతనితో రంగనాథాలయంబునకుఁ బోయి ఆశ్రిత వాత్సల్యజలధియగు రంగనాథుని దివ్యమూర్తిని సేవించి యతని నేత్రపద్మంబులఁ జూచి ఆనందపరవశుఁడై రామానుజార్యుని పాదపద్మంబుల నాశ్రయించి యతని దన్నురక్షింపఁ బ్రార్థించెను.

కరుణాసముద్రుఁడైన యా రామానుజార్యుఁడు అతనిని భార్యాసహితంబుగ పంచసంస్కారసంపన్నునిఁ గావించి నిజశిష్యులలో నత్యాదరముతోఁ జూచుచుండెను. రామానుజార్యుఁ డిట్లొకశూద్రు నధికముగా నాదరించుట చూచి

యిత్తరవైష్ణవులు, సహింపలేక, ధనుర్దాసుని విషయమున మత్సరము వహించి యుండిరి. రామానుజార్యుఁ డావిషయము తెలిసికొని ధనుర్దాసుని సుగుణ సంపత్తిని వారికి నిరూపించి వారియీర్ష్యను బోఁగొట్టఁదలంచి యొక నాఁడు ధనుర్దాసుని బిలిచి యావైష్ణవులదోవతులలో కౌపీనమునకు చాలినంతభాగమును వారికి తెలియకుండ చించితెమ్మని యాజ్ఞాపించెను. ధనుర్దాసుం డట్లుసేయ మఱునాఁ డావైష్ణవు లొకరినొకరు పలువిధములుగ దూషింపఁ దొడఁగిరి. రామానుజార్యుఁడు వచ్చి వారికి హితోపదేశము సేసి వారి నివారించునంతవఱకాకలహము నిలువదాయెను. మఱునాఁడు రామానుజార్యుఁ డావైష్ణవులఁ బిలిచి ధనుర్దాసుఁడు భార్యాసహితుఁడై నిద్రించు సమయమున వానిభార్యయొక్క యాభరణముల నన్నిటిని దొంగిలించి తెమ్మని యాజ్ఞాపించెను. వారంత ధనుర్దాసునిమీఁది కసితీర్చుకొనుటకు సమయము కలిగెనుగదాయని సంతోషపరవశులై యారాత్రి ధనురాసునింటఁ బ్రవేశించి వానిభార్య యొక్క దేహమున నొకప్రక్కనుండిన యాభరణముల

నన్నిటిని ఒలుచుకొన నాస్వాధ్వీమణి యంతలో నిద్రతేరి కనులుదెఱచి ప్రక్కన నిలిచియున్న వైష్ణవసత్తములఁజూచి తక్కినపార్శ్వంబుననున్న యాభరణంబులఁగూడఁ దీసికొనుటకు వారి కవకాశమియ్య నిశ్చితురాలై తక్కిన ప్రక్కకు తిరిగి పండుకొనెను. ఇంతలో వారు తమచౌర్యము బయలు పడెనని భయభ్రాంతులై పాఱిపోయిరి. ఉదయమున ధనుర్దాసుఁడు ఆవిషయమువిని "నీవేలపొరలితివి? వైష్ణవుల విషయమున నపచారము కావించితివే. వారు నిన్నుపొరలించి యాపార్శ్వముననుండిన యాభరణములను గూడ తీసికొనలేరా?" యని భార్యమీఁదఁ గోపించి భార్యను పిలిచికొని రామానుజార్యుని యొద్దకువచ్చి యావద్వృత్తాంతమును ఆగురుసత్తమునికి నివేదించెను. రామానుజార్యుం డప్పుడు ఇతరవైష్ణవులను రావించి వారితో "చూచితిరా ధనుర్దాసుని యధ్యవసాయము? మీదోవతులలో కౌపీనములు చింపఁబడినవని మీరలు పరస్పరము దూషించుకొంటిరి. మీదోవతులను చింపించినది నేనే చించినవాఁడు ధనుర్దాసుఁడు. తనభార్య యాభరణములు పోయిన

వని యతనికేమన్న వ్యసనమా? తెక్కిన యాభరణములను గూడ మిమ్ము తీసికొని పోనియ్యలేదని అతఁడుభార్యమీఁద కోపించుచున్నాఁడు చూడుఁడు." అని ధనుర్దాసుని ప్రశంసింప నావైష్ణవులు భంగపడి తమగుణహీనతను దామేనిందించుకొని యప్పటినుండి ధనుర్దాసుని గౌరవించుచుండిరి.

చోళభూపాలుఁడగు క్రిమికంఠుని యుపద్రవమున రామానుజార్యుఁడు పశ్చిమదేశమునకు విచ్చేయుట

రామానుజార్యుఁడు ఇతర సకలమతములనుఖండించి దిగ్విజయముచేసి విశిష్టాద్వైతమతమును ప్రతిష్ఠాపించి నిజకీర్తికాంతిచే లోకమును వెలిఁగించుచు శ్రీరంగపట్టణమున వేంచేసియుండు సమయమున చోళదేశమును క్రిమికంఠుఁడనురాజు శైవధర్మనిరతుఁడు విష్ణుదూషకుఁడు పాలించుచుండెను. ఇతఁడు స్వాధికారబలముచే శైవమతమును వ్యాపింపఁజేయ నెంచి, "శివాత్పరతరంనాస్తి" * యని యొకలేఖనము వ్రాసి దానినందఱకు చూపి వారు దానికి సమ్మతించినందులకు గుర్తుగా వారిని దానిక్రిందఁ జేవ్రాలు

* శివునికన్న నధికుఁడు లేఁడు.

సేయుమని బలాత్కారము సేయుచు అట్లు సేయనివారిమీఁద క్రూరదండనము విధించుచు వైష్ణవకంటకుఁడై వర్తించు చుండెను. అదివిని కొందఱు రాజభయముచేతను తుటి కొందఱు స్వదేశమునువిడిచిపోలేకయు లోఁబడిరి. కొందఱు స్థిరమనస్కులై రాజును ధిక్కరించి నిర్భయముతో కఠిన దండనములపాలైరి. మఱికొందఱు గృహక్షేత్రపశ్వాదుల విడిచి, " బ్రతికియుండిన శుభములఁ బడయవచ్చు," నని పారిపోయిరి. అప్పుడు కూరేశ్వరుని శిష్యుఁడొక బ్రాహ్మణోత్త ముఁడు రాజునొద్దకుఁబోయి యీసామాన్యజనుల లోఁబఱచి చికొన్నందున ప్రయోజనము లేదు, వైష్ణవమతపరిపాలకుఁడై శ్రీరంగపట్టణమున విజయముచేసియుండు రామానుజార్యుని శైవునిగఁగావించిన తక్కినవైష్ణవులందఱును లోఁబడుదురని చెప్ప, క్రిమికంఠుఁడు తత్క్షణమే రామానుజార్యుని బంధించి తెచ్చుటకు భటులను బంపెను. ఆభటులు శ్రీరంగమునకుఁ బోయి రామానుజార్యుని వెదకుచుండ కూరేశ్వరుఁడు యతీంద్ర మజ్జనార్థము కావేరినుండి జలకుంభముధరించి వచ్చు చుండి యాభటులు " రామానుజార్యుఁ డెక్కడ ? రామా

నుజార్యుఁడెక్కడ?" అని నిజగురు నన్వేషించు మాటల విని వారియుద్యమంబును క్షణమాత్రంబున గ్రహించి నిజ గురుమఠమును బ్రవేశించి జలకుంభమును దింపి తన వస్త్ర ముల నచ్చట విడిచి రామానుజార్యుని త్రిదండకాషాయ వస్త్రంబుల ధరించి యతిత్వరితముగ బయటికివచ్చి యాభ టులకు వశుఁడయ్యెను. అట్లు బయటికిపోవు కూరేశుని జూచి పెరియనంబి అతనివెంటనంటిపోయి తానును ఆభటు లచే బద్ధుఁడాయెను.

ఆవృత్తాంతమునంతయు విని రామానుజార్యుఁ డిక నిచ్చటనుండుట యుక్తముకాదని సన్నిధిశిష్యులుం దానును బశ్చిమదిక్ప్రాంతమునకువిజయముచేసెను. మార్గమునవా రొకకారడవిని క్షుత్పిపాసాపీడితులై కష్టపడుచుండ నక్కడ కొందఱు బోయలు వారిని జూచి వైష్ణవులని గుర్తించి యాబోయలు. తిరుమలైనల్లాన్ శిష్యులుగాన నావైష్ణ వోత్తములఁగని పరమానంద భరితులై వారు శ్రీరంగ పట్టణవాసులని వారివలననే తెలిసికొని వారిని "రామా నుజార్యులు సుఖులేనా?" అని యడిగిరి. దానికావైష్ణవోత్త

ములు విస్మయము చెంది రామానుజార్యులు మీరెట్లెఱుఁగు దురని యడుగ నాబోయలు "మాగురువువలన నెఱిఁగితిమి రామానుజార్యులకీర్తి జగద్విదితముకదా?" యని బదులు సెప్పిరి. అంత నావైష్ణవు లాబోయల కిలయాళ్వార్లనుజూప వారు సంతుష్టాంతరంగులై గాలికిని ఎండకును వానకును శ్రమచెంది చలికి వడఁకుచున్న యావైష్ణవులకుఁగా నప్పు డక్కడనుండిన యెండుటాకులనుజేర్చి మంటవేసి వారిని బహువిధముల నుపచరించి మఱునాఁడు సమీపమునందుం డిన చేలాంచలాంబ సదనంబునకు బిలిచికొనిపోయిరి.

ఆవైష్ణవులను వారిలో ఇలయాళ్వారిని జూచి చేలాంచలాంబ పరమానంద భరితయై వారిని మీరు మా యింటికి వేంచేయుఁడు. దాసురాలివలన సిద్ధపఱుపఁబడెడు పంచభక్ష్యపరమాన్న సహితంబగు నన్నంబును గ్రహిం పుఁడు. నన్నుంగృతార్థురాలిని గావింపుఁడు." అని ప్రార్థిం చెను. రామానుజార్యుఁ డామెభక్తివిశేషంబుల కచ్చెరువం దియు నామెతో "మేమువైష్ణవులము నీవు పంచసంస్కార సంపన్నవు గావు కాన మీయింట మేమెట్లు భుజింపఁ

వచ్చెను!" అనిచెప్పెను. చేలాంచలాంబ "నేనుకూడ మీ యొక్క శిష్యురాలనేకదా, ఎట్లన ఈదేశమున ద్వాదశ వర్ష క్షామము తటస్థించినప్పుడు నేను శ్రీరంగమున నాతండ్రి గృహమునకు వచ్చియుంటిని. అచ్చట నొకనాఁడు మిద్దె మీఁదనిలిచి వీథిప్రక్కఁ జూచుచుండ మీరు బిక్షార్థము ప్రతిగృహమునకు పోవుచుంటిరి. మఱునాఁడటులే మిద్దె మీఁద నిలిచియుండ మీరే రాజాధి రాజులచేతను, వేద వేదాంత పారగులగు పండితోత్తములచేతను, పరివేష్టింపఁ బడి నక్షత్రమధ్యంబున చంద్రమండలంబుపగిది దేదీప్య మానులై పోవుచుంటిరి. అప్పుడు నేను విస్మయము చెంది సౌధము డిగి చేత భిక్షఁగైకొని ఎంతమంది వారించినను నిలువక మీ యొద్దకు వచ్చి, స్వామీ, మహానుభావా, మీరు ఉంఛవృత్తి నవలంబించినవారయ్యు రాజాధిరాజ సంసేవ్య మానులై యున్నారే! మీమహిమ అవాఙ్మానసగోచ రము. దాసురాలిని క్షమించి దాసురాలి కారహస్యమును దెల్ప మీరు ప్రార్థితులు." అని మిమ్ము వేడుకొంటిని అప్పుడు మీరు నామీఁద కరుణించి నాచెవిని ఒకమంత్రము

నుపదేశించితిరి. పిమ్మట నేను ఇక్కడికి వచ్చి భర్తృపరిచ ర్యాదిక వ్యాయామములచే నామంత్రరాజంబును మఱచి తిని, హే మహాప్రభో, నన్ను మన్నించి నామీఁద కరుణించి యామంత్రమును నాకిప్పు డుపదేశింపుఁడు.'' నీపాదుకలను నాకొసంగి నన్ను రక్షింపుఁడు అని వేడ భక్తవాత్సల్య జలధి రామానుజార్యుఁడు ఆమెకు ద్వయమంత్రము నుపదేశించి యామె యింట భుజింప సమ్మతించెను. చేలాంచలాంబయు అన్నమును సిద్ధముసేయ నుపక్రమించెను. అపుడు రామా నుజార్యుఁడు శిష్యులను బిలిచి చేలాంచలాంబ పాకము నెట్లుసేయునో అదృశ్యులై పరీక్షింపుఁడని యాజ్ఞాపించెను. చేలాంచలాంబయు స్నానముచేసి మఱియొక పరిశుద్ధమగు వస్త్రమును ధరించి శుచివ్రతయై "మన్నాథపాదాశ్రయ ణమ్'' అని యుచ్చరించుచు అన్నమును సిద్ధముసేసి యతీం ద్రుని పాదుకలను దేవగృహమునకుఁ గొనిపోయి ద్వయాను సంధానముసేయుచు గురుపరంపరను జపించుచు పాదుకల నతిభక్తితోఁగడిగి యథావిధిగ పూజించి గంధపుష్పాది ద్రవ్యముల నర్పించి గురుధ్యానపరయై నైవేద్యమును సమ

ర్షించెను. ఆసాధ్వీమణి వర్తనమంతయు శిష్యులవలన విని రామానుజార్యుఁడు సంప్రహృష్టాంతరంగుఁడై శిష్యులతోఁ గూడ భుజించి యచ్చటనే ప్రొద్దుపుచ్చుచుండెను. రాత్రి యజమానుఁడింటికి రాఁగా చేలాంచలాంబ అతనిని రామానుజార్యుని మహిమ విశేషంబుల శ్లాఘించి చెప్పి యతనిచే రామానుజార్యుని పాదకమలముల నాశ్రయింపించెను. రామానుజార్యుఁడు వారిని భార్యాభర్తలను పంచసంస్కార సంపన్నులుగఁ గావించి యచ్చటినుండి బయలుదేరి పశ్చిమముగఁబోయి వహ్నిపుష్కరిణిసేరి యచ్చట మూఁడుదినములుండి యంత మిథిలాపురి సేరెను. మిథిలాపురజనులు మాయావాదులైనందున నచ్చటివారెవరును రామానుజార్యుని సత్కరింపరైరి. యతీంద్రుఁడు వారిని జూచి కరుణార్ద్రచిత్తుఁడై శిష్యుఁడగు దాశరథిని బిలిచి యాయూరి జనులందఱు విశేషముగ నెచ్చట తిరుగుదురో యచ్చట నతసి శ్రీపాదతీర్థమును ప్రసాదించి రమ్మని యాజ్ఞాపించెను. అతఁడట్లుసేయ నాయూరిజనులందఱు గుంపులు గుంపులుగ వచ్చి లక్ష్మణదేశికుని పాదకమలముల నాశ్రయించి కృతా

ష్ఠులైరి. గురువర్యుఁ డంత, మిథిలాపురికి సాలగ్రామమని తిరునామంబిడి యంత నృసింహక్షేత్రమునకుఁ బోయి నృసింహస్వామిని సేవించి చోళోపద్రవపీడితులగు పెరియ నంబి కూరత్తాళ్వారులను రక్షింపుమని ప్రార్థించి క్రిమికంఠ నాశహేతుకముగ నృసింహమంత్రమును జపించి యంత బయలుదేరి భక్తగ్రామము సేరెను. ఆపట్టణమేలు విఠ్ఠల దేవరాయనికూతురు పిశాచగ్రస్తయై దిగంబరియై వీథు లయందుఁ బరుగెత్తుచుండెను. రామానుజార్యుని శిష్యుఁడు భక్తగ్రామపూర్ణుఁడు రాజునకు గురువర్యు నాశ్రయిం చిన అతనికూతురు పిశాచవిముక్తయగునని యుపదేశించెను. రాజు సమ్మతించి రామానుజార్యుని నిజసదనంబునకుఁ బిలిచికొనిపోయి యతని శ్రీపాదతీర్థము తనకూఁతు మీఁదఁ జల్లఁగా నామె. రాహుముక్తుఁడగు చంద్రుని పగిది దేదీప్యమానముగా వెలిగి నిజజననీజనకులకు కనుల పండువు గావించెను. రాజు పరమానంద భరితుఁడై రామానుజార్యునిమహిమ కచ్చెరువంది యతని పాదకమలముల నాశ్రయించి పంచసంస్కార సంపన్నుఁడాయెను. గురువ

ర్యుం డతనికి విష్ణువర్ధనుఁడని, నవీననామం బిడి యతనిని వశ్యపఱచికొనెను. ఆవార్త విని పదివేలమంది బౌద్ధులు కోపావేశపరవశులై యతీంద్రునిమీఁదికి వచ్చి "మమ్ము వాదమున నోడింపక నీవు మారాజు నెట్లు లోఁబఱచి కొనవచ్చును? లేలెమ్ము, మాతో తర్కవాదము సేయుము. ఏదీ నీపాండిత్యము చూతము!?" అని ఘర్షణోక్తులాడిరి. లక్ష్మణదేశికుఁడు మేరుధీరుఁడైనను అశక్తునిభంగి భయ మభినయించి "స్వామీ, నేనేమి సేయుదును, ఎక్కడికి పోవుదును ?" అనిపలుకుచు నచ్చటి మండపములోనికిఁ బోయి ఆబౌద్ధులకు కనఁబడకుండ మరుగుకావించికొని సహస్రఫణామండితంబగు స్వస్వరూపముధరించి గంభీరముగను స్ఫుటముగను ఆబౌద్ధులప్రశ్నల కన్నిటికిని ప్రత్యుత్తరముల నిచ్చి, "చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణామ్ । ఏకశ్చరామోధర్మాత్మా కథంయుద్ధం భవిష్యతి" అన్నట్లుశ్రీరామచంద్రుఁ డొక్కరుఁడ పదునాలుగువేలమంది రాక్షసుల ఖరదూషణాదుల జయించినట్లు రామానుజార్యుఁడు. తానొక్కరుఁడ పదివేలమందిబౌద్ధుల జయించెను. అతని యద్భు

తశక్తిని జూచి బౌద్ధులు విస్మయము చెంది యతని పాద కమలముల నాశ్రయించి కృతార్థులైరి.

శ్రీరామచంద్రుఁడు లోకకంటకులగు రాక్షసులను వధించి సీతామహాదేవిని రావణాది రాక్షసుల చెఱనుండి విడిపించి ధర్మసంస్థాపనముసేసి అయోధ్యయం దేకచ్ఛత్రాధిపత్యముగ రాజ్యముసేసినట్లు శ్రీరామానుజాచార్యుఁడును సత్యవిద్వేషులగు మాయావాదాది కుమత సిద్ధాంతంబుల నిర్మూలనము గావించి పరమవైష్ణవసిద్ధాంతమును పాంచరాత్రాగమమును లోకమందెల్లఁ దెల్లముగ వ్యాపింపఁజేసి విశిష్టాద్వైత మతసిద్ధాంతమును భక్తిమార్గమును సంస్థాపించి రాజాధిరాజులుకూడ తన్గొలువ భక్తి గ్రామమున పేరునకు విష్ణువర్ధనుఁడును, వాస్తవముగ తానున్న ప్రజాపరిపాలనము సేయుచుండెను. ఐన నచ్చట శ్వేతమృత్తు దొరకనందున లక్ష్మణదేశికుఁడు దుఃఖితాత్ముఁడై యుండెను. ఇట్లుండ నొకనాఁడు యాదవాచలనాయకుఁడు తిరునారాయణస్వామి గురువర్యునికి స్వప్నంబున యదుశైలంబున శ్వేతమృత్తికయు తానుండుట తెలియఁబఱిచి అం

త్రి తుడాయెను. యతీంద్రుఁడు మేల్కాంచి విస్మయా నందంబులు మనంబునఁ బెనఁగొన తత్క్షణము రాజునొద్దకుఁ బోయి యావిషయమతనికి తెలియఁజేసి యతఁ డనేక భటులతో వెంటరా, తానును సరస్సున స్నానముసేసి శుచియై యార్ద్రవస్త్రంబులతో యదుశైలమున వెదకిచూచెను. ఎక్కడ చూచినను తిరునారాయణస్వామియు కనఁబడలేదు. శ్వేతమృత్తికయు దొరకలేదు. అంతన రామానుజార్యుఁడు ఖిన్నుఁడై యుండ తిరుగ యాదవాచలనాయకుఁ డతనికి స్వప్నమునఁ గనబడి, "కల్యాణతీర్థము దక్షిణతీరమున తులసీవృక్షము ప్రక్కన ఒకవల్మీకమున్నది. నేనచ్చటనున్నాను. ఉత్తరతీరమున శ్వేతమృత్తిక మహాదివ్యమైనదున్నది. అది నాయాజ్ఞచొప్పున శ్వేతద్వీపమునుండి గరుడునిచేఁ దేఁబడి యక్కడనుంచఁబడినది." అనిచెప్పి యంతర్ధానముచేసెను. యతీంద్రుఁడు మేల్కాంచి యీ వార్త రాజునకుఁ దెలియఁ జేసి కల్యాణతీర్థము దక్షిణతీరమున పొదయొద్ద బహుధాన్య సంవత్సరము శుక్లపక్షము చతుర్దశి గురువారము పునర్వసు నక్షత్రమున త్రవ్వించి చూడ నక్కడ తిరునారాయణస్వామి

కోటిసూర్య ప్రకాశమానుఁడై చూచువారికన్నుల మిఱుమిట్లుగొల్పుచు రామానుజార్యుఁ హృదయకమలమును వికసింపఁజేయుచు భక్తకోటికి దర్శన మొసంగెను. ఉత్తరితీరమున దివ్యమైన శ్వేతమృత్తికయు దొరకెను. గురువర్యుని కోరికచొప్పున విష్ణువర్ధనుఁడు యదుశైలంబున గోపురమంటప ప్రాకారాదుల కట్టించి ఆయాలయంబున తిరునారాయణస్వామిని ప్రతిష్ఠాపించు నట్లేర్పాటు చేసెను. సంప్రోక్షణాది క్రియలు జరిగిన అనంతరము ఉత్సవవిగ్రహము లేదని చింతాక్రాంతుఁడై యుండుయతీంద్రునికి తిరుగ నారాయణుఁడు స్వప్నమున రామప్రియులు డిల్లీపురంబున వేంచేసి యుండుట తెలియఁబఱిచెను. గురువర్యుఁడు మేల్కాంచి యావార్త విష్ణువర్ధనునికి తెలియఁజేసి డిల్లీపురంబుమీఁదికి దండెత్తవలయునని నిజశిష్యవర్గంబుకెల్ల చాటిచెప్ప నప్పుడు వేనవేలుమంది సన్నద్ధులై ఒక్కొకఁడును తానేపోయి డిల్లి పాదుషాను జయించి రామప్రియుని దెత్తునని యుత్సహించుచుండెను. ఇట్లు లెక్కకుమిక్కిలిగ భటులు తన్ను పరివేష్టించి ప్రాణముకూడ తనకర్పించి పర్వతసరి న్మహాంభోధు

లనుగూడ తనతోఁదాట సంసిద్ధులై నడువ లక్ష్మణదేశికుఁడు డిల్లీపురంబుపై దండయాత్రకు వెడలెను. ద్వాదశోర్ధ్వపుండ్రమండితాంగులును, వేదవేదాంత పారగులును, అగువైష్ణవోత్తములు వేనవేలుమంది ఉభయవేదముల నధ్యయనము సేయుచు గుంపులు గుంపులుగ "నేల యీనిన దండు వోలె" కూడినడుచుట నేత్రానందజనకంబుగను, శాంతగసమూర్తులు వారు యుద్ధమునకు వెడలుట సీట నగ్నిపుట్టినట్లు విస్మయకారణంబుగను ఒప్పెను. ఈవైష్ణవసేనను దూరంబునఁ జూచి డిల్లీపాదుషా భీతచిత్తుఁడై వారియుద్యమము నెఱుఁగఁ గోరి చారులను బంపెను. వారు వచ్చి రామానుజార్యుని జూచి విస్మయావిష్ట మానసులై అతని యద్భుతతేజస్సును మృదుమధురవాక్కులను డిల్లీపాదుషాకు అభివర్ణించి చెప్పిరి. డిల్లీపాదుషా అంత మంత్రియుతముగ నేతెంచి రామానుజార్యుని యుద్యమము నడిగి తెలిసికొని తన సౌధమును వెదకించి చూచి ఎక్కడను రామప్రియుని గానక యావిషయము గురువర్యునికి నివేదించెను. అది విని రామానుజార్యుఁడు దుఃఖార్తుఁడై యుండ నాఁనికి స్వప్న

మునరామప్రియుఁడు ప్రత్యక్షమై తాను ఢిల్లీశ్వరుని పుత్త్రికయొద్దనుండుటను దెలియఁబఱచెను. రామానుజార్యుఁడు మేల్కాంచి పరమానందభరితుఁడై ఢిల్లీశ్వరుని కావార్త తెలియఁజేసిఢిల్లీశ్వరుని పుత్త్రికశయనగృహంబు వెదకింపనందు రామప్రియుఁడు కనఁబడెను. రామప్రియుని జూచి రామానుజార్యుఁడు "అస్మత్సంపత్పుత్త్రా" అనియాహ్వానముసేసెను. అప్పటినుండి రామప్రియునికి సంపత్కుమారుఁడను పేరు లోకప్రసిద్ధమయ్యె. గురుప్రవరుఁడట్లు రామప్రియుఁడు దొరకినందుకు సంప్రహృష్టాంతరంగుఁడై జయజయధ్వానంబులతో శిష్యులు తన్నుపరివేష్టించి రా యదుశైలమునకు పయనమాయెను. అచ్చట ఢిల్లీశ్వరునిపుత్త్రి* రామప్రియ వియోగముచే అతి దుఃఖితయై యుండెను పాదుషా నిజపుత్త్రికవలన తద్దుఃఖకారణం బెఱిఁగి తాను ప్రియునెడబాసి యామె తానుజీవించుటకూడ దుర్లభమని

---

* రామప్రియుఁడు పగలంతయు విగ్రహముగనుండి రాత్రి ఒక యౌవన పురుషుఁడై జగన్మోహనాకారముతో ఢిల్లీశ్వరుని పుత్త్రికతో రమించుచుండును.

యొత్తిచెప్ప రాజు లక్ష్మణదేశికుని బిలువనంపి తనకూఁతుఁ గూడనతనికిసమర్పించెను. ఇట్లు శెల్వప్పిళ్లెతోను డిల్లీశ్వరు పుత్త్రికతోను పోవుచుండ మార్గమున డిల్లీశ్వరునిపుత్త్రి రామప్రియునితో నైక్యభావమునొందెను. డిల్లీశ్వరుని పుత్త్రి యదృశ్యకాఁగాఁ జూచి యందఱు నాశ్చర్యము నొందిరి. ఇట్లు ఉత్సవవిగ్రహమును సాధించి తెచ్చి యతీంద్రుఁడు సంపత్కుమారునికి ప్రత్యేకముగ గృహమేర్పాటు చేయించి యందావిగ్రహమును సంప్రోక్షణాదిక్రియలతో బ్రతిష్ఠాపించి మహాపరిఢవముతో నుత్సవాదిక్రియాలు జరిపించుచు ఆనందపరవశుఁడై పండ్రెండుసంవత్సరంబులు యదుశైలమునందే యుండెను.

### యాదవాద్రియొక్క మాహాత్మ్య మనిర్వాచ్యము.

కృతయుగమునందు సనత్కుమారుఁడు సత్యలోకంబునఆనందమయమైన దివ్యవిమానమునందుండునట్టి తిరునారాయణస్వామినిదెచ్చినిచ్చోఁ బ్రతిష్ఠించినందున దీనికి నారాయణాద్రియనియు, త్రేతాయుగమునందు దత్తాత్త్రేయుండు నాలుగువేదపురుషులతోఁగూడవచ్చి వేదపుష్కరిణీతీరమునం

సదా వేదాధ్యయనసిరతులై యుండినందున వేదాద్రియని యు, ద్వాపరయుగమున శ్రీకృష్ణాదియాదవశ్రేష్ఠులచే నారాధింపఁబడినందున యాదవాద్రియనియు, ఈ కలియుగమునందు యతిసార్వభౌమునిచే జీర్ణోద్ధారణము చేయఁబడినది కాన యతిశైలమనియు, ఈ దివ్యక్షేత్రమునకు నామవిశేషంబులొప్పియున్నవి. ఆచార్యకైంకర్యమువలనఁ గలుగు ఫలము తిరునారాయణపురము నందెల్లప్పుడు నివసించుటచే పొందవచ్చునని యతిశేఖరుఁడే నొక్కి చెప్పియున్నాఁడు.

అటు రామానుజార్యునికిఁ గానువచ్చిన చోళభటులతోఁ గూడఁబోయి పెరియనంబియు కూరనాథుఁడును చోళరాజు ముందు నిలిచిరి. రాజంతట "శివాత్పరతరం నాస్తి" అని వ్రాసిన తాళపత్త్రమును వారిముందర నుంచి దానికి సమ్మతించినందునకు గుఱుతుగా వారిని చేవ్రాలు సేయుమని చెప్పను. కూరనాథుఁడు అతఁడజ్ఞానాంధకారమున నున్నాఁడని యతనిమీఁద కరుణించి బహువిధములుగా ననేక శ్రుతి స్మృతీతిహాస పురాణములనుండి ప్రమాణముల నుదాహరించి శ్రీమన్నారాయణుఁడే సర్వోత్కృష్టుఁడును జగ

త్కారణభూతుఁడును సకలజగత్సృష్టి స్థితిసంహారకర్తయు, కాననతఁడే ధ్యేయుఁడని నిరూపించెను. పెరియనంబియు నట్లే అనేక ప్రమాణములచే విష్ణుపరత్వమును స్థాపించెను. అదివిని రాజు క్రుద్ధుఁడై వారితో "మీరు గొప్పపండితులు మీపాండిత్య మటుండనిండు. ఆ తాళపత్త్రములో మీచే వ్రాలు వేయుఁడు" అనిగర్జించెను. కూరనాథుఁ డాపత్త్రమును దీసికొని దానిలో "శివాత్పరతరంనాస్తి" క్రింద "ద్రోణమస్తితతఃపరః" అనివ్రాసి రాజునకు చూపెను. రాజంత రోషారుణితనేత్రుండై వారిద్దఱికండ్లను పెఱికివేసి వారిని కారాగృహబద్ధులం గావింపుఁడని తనభటుల కాజ్ఞాపించెను. నావుఁడు కూరనాథుఁడు రాజువంకతిరిగి, "నీవంటి పరమపాపినిజూచిన నేత్రములతో గురువర్యుని వీక్షించిన మహాదోషము సంభవించును" అని తననేత్రములను దానే పెఱికి వేసికొనెను. భటులంత వారినిద్దఱిని బద్ధులఁగావించి పెరియనంబినేత్రములను బెఱికివేసి చెఱసాలయం దుంచెను. పెరియనంబి వృద్ధుఁడుకాన నాబాధ సహింపలేక శీఘ్రకాలములోనే మృతినొందెను. కూరనాథుఁడుమాత్రము నిజ

గురు పాదకమలములను ష్కాత్రిరమున నెలకొల్పి కారాగృహబాధనంతయు నలక్ష్యభావముతోఁ జూచుచుండెను. పిమ్మట కొన్ని సంవత్సరములకు చోళరాజు మృతినొందెను. రామానుజార్యుఁ డీవృత్తాంతమునంతయువిని యదుశైలంబున నిజశిష్యవర్గంబున కర్చారూప విగ్రహంబు గావించి యొసంగి వారిచే శెల్వప్పిళ్లకు కాలోచిత కైంకర్యంబులు నడపించునట్లు ప్రమాణంబు గావించుకొని శ్రీరంగమునకు పయనమాయెను. శ్రీరంగమునకుఁజని ఉడయవరులు కూరనాథునాదరించి కొన్నదినములచటనుండి యంత బయలుదేరి తిరుపతికిజని తిల్లగోవిందరాజుల నందుఁబ్రతిష్ఠించి స్వామిని సేవించి యందుండి తేనప్పెరుమాళ్ల సన్నిధికింజని యందు కొంతకాలముండి మరలి శ్రీరంగమునకుఁబోయి మఠంబు చేరి శిష్యులకు హితోపదేశము సేయుచుండెను.

అనంతరము కొన్ని దినములకు ఉడయవరులు కూరనాథుని వెంటనిడుకొని కాంచీపురమునకుఁబోయి యచట వరదరాజస్వామి విషయమున నొకస్తోత్రమురచించి యతనివలన జ్ఞానదృష్టిని బడయుమని కూరనాథునికి హితోపదేశము

చేసెను. కూరనాథుఁడు. శ్లో॥ స్వస్తిహస్తిగిరిమస్తశేఖర స్సంతనోతుమయి సంతతంహరిః। నిస్సమాభ్యధికమభ్యస్తత్రయం దేవమౌపనిషదీసరస్వతీ॥ అని ప్రారంభించి, శ్లో॥ నీలమేఘనిభమంజనపుంజ శ్యామకుంతలమనంతశయం త్వామ్। అబ్జపాణిపదమంబుజనేత్రం నేత్రసాత్కురు కరీశసదామే॥ ఇతి శ్లోకార్థ సదృశ దివ్యరూప ప్రదర్శనే। యోగ్యమప్రాకృతం చక్షు ర్దేహిమేకమలేక్షణ॥ అను ప్రార్థనగల స్తోత్రరాజంబొకటి రచించి పునర్నేత్రప్రాప్తి వడసి కృతార్థుండాయెను.

అంత రామానుజార్యుఁడు తానుచేయఁదలఁచిన కార్యము నెఱవేఱినదని యిఁక దేహత్యాగము చేయఁదలఁచి తనశిష్యులను జేరఁజీరి వారికిట్లు ధర్మోపదేశము గావించెను;

1. మీగురువునకు వైష్ణవులకును భక్తితో నెల్లప్పుడు కైంకర్యము చేయవలయును, 2. పూర్వాచార్యులుచెప్పిడివాక్యముల నమ్మవలయును, 3 ఎప్పుడు నింద్రియములకు వశుఁడుగా నుండరాదు, 4. ఎప్పుడు సాధారణశాస్త్రముల యందాసక్తి నుంచక భగవద్విషయికశాస్త్రములయందే యాసక్తుడుగా నుండవలయును, 5. ఆచార్యులవారిదయచేత జ్ఞానమును గలవాఁడై విషయాదులకు వశుఁడుకారాదు, 6. శబ్దాదివిషయము

లను సామాన్యముగా చూడవలయును, 7. పుష్పములు మొదలగు పరిమళ వస్తువుల నుద్దేశించరాదు, 8. భగవన్నామకీర్తనమునందువలెనే భగవద్భక్తనామకీర్తనమునందును ప్రీతియుంచవలెను, 9. ఎల్లప్పుడు భక్తులనాశ్రయించుట భగవత్ప్రాప్తికి కారణము, అని యెంచి భక్తులనాశ్రయించవలయును, 10 రాగాదులకు లోబడినవాడై విష్ణువుయొక్కయు వైష్ణవులయొక్కయు కైంకర్యమును మఱచిన నశించును, 11. భగవద్భక్తులను, ఏకవచనముగా నెల్లప్పుడు పిలువరాదు, 12. వారిని చూచినతోడనే యంజలిబద్ధుడు కావలయును, 13. విష్ణుసన్నిధియందును వైష్ణవసన్నిధియందును కాళ్లు సాచికొని యుండరాదు, 14. ఇదిగాక విష్ణువుయొక్కయు వైష్ణవులయొక్కయు నింటితట్టును కాళ్లు సాచుకొని నిద్రపోగూడదు, 15. నిద్ర లేచినతోడనే గురుపరంపరను దలంపవలయును, 16. విష్ణుసన్నిధియందు కూర్చుండు భాగవతులను చూచినమాత్రాన దండప్రణామము చేయవలయును, 17. వైష్ణవులు భగవంతునిగాని భాగవతులనుగాని కీర్తించునపుడు తనశక్తికొలదిని వారిని పూజించక నడుమ లేచిపోవుట మిగుల నపరాధమగును, 18. వైష్ణవులు వచ్చుటను జూచినతోడనే లేచి వారికి ముందుగా నెదురు చనవలయును, 19. పోవునపుడు కొంతదూరము కూడ పోయి రావలయును, ఈ రెండుపనులు చేయని యెడల గొప్పదోషము చేసినవాడగును, 20. తనజీవనార్థమునకు గూడ వినయాదిగుణములతో గూడుకొన్నవాడై మహాత్ములైన వైష్ణవుల ననుసరించియే ప్రవర్తించవలయును, అట్లుగాక యితరుల నాశ్రయించిన గొప్పదోషము సంభవించును, 21. విష్ణువుయొక్క ఆలయములను గోపురాదులను చూచినతోడనే నమస్కరింపవలయును,

22. ఇతరాలయాద్యులను చూచినప్పుడుగాని ఇతరదేవతాకీర్తనమును విన్నప్పుడుగాని ఆద్భుతపడవలసినదిలేదు, 23. విష్ణువైష్ణవులకీర్తనమును విన్నతోడనే సంతసించక ఆక్షేపించినయెడల గొప్పదోషముసంభవించును, 24. వైష్ణవులయొక్క దేహచ్ఛాయను ఎప్పటికిని దాటరాదు, 25. తనదేహచ్ఛాయస్పర్శయును వారిదేహచ్ఛాయకుకలిగింపరాదు, 26. అట్లుస్పృశించినయెడల వైష్ణవులను మఱితాకఁగూడదు, 27. వైష్ణవుడుదరిద్రుఁడైనను ముందుగానమస్కరించినప్పుడు అలక్ష్యముచేసినయెడల నెక్కుడుపాతకముసంభవించును, 28. (దాసోహమ్) దాసుడనని ముందునమస్కరించినప్పుడు ఆదరింపకపోవుట గొప్పదోషము, 29. శ్రీవైష్ణవులయొక్క జన్మనిద్రాలస్యాదిదోషములను దానెఱిగినను వెల్లడి చేయరాదు, 30. దోషములనువదలి గుణములనుమాత్రము ప్రకటింపవలయును, 31. విష్ణుపాదోదకముగాని భక్తపాదోదకముగాని సామాన్యులు చూచుచుండగా త్రాగరాదు, 32 తత్త్వత్రయజ్ఞానముచేతను రహస్యత్రయజ్ఞానముచేతను రహితుడయ్యెనేని అట్టివానిపాదోదకమును గ్రహింపరాదు, 33. సదాచారముచేతను జ్ఞానానుష్ఠానముచేతను ప్రకాశించెడి వైష్ణవపాదోదకమును మిగులప్రయత్నముతో నిత్యముగ్రహింపవలయును 34. శ్రీపాదతీర్థముగ్రహించునపుడు సచేలస్నాతుడైయుండవలయును, 35. వైరాగ్యజ్ఞానభక్త్యాదిగుణములుగలిగి మహాత్ములుగానుండెడి వైష్ణవులకు ముఖ్యముగా నమస్కరించి వారియందు విశేషముగా విశ్వాస ముంచవలయును, అట్టివారినే పూజ్యులనుగా దలంచవలయును, 36. సామాన్యులగృహములయందు విష్ణుతీర్థమును గ్రహింపరాదు, 37. అట్టివారిగృ

హములయందుండెడి విష్ణువిగ్రహములను సేవించరాదు, 38. సామాన్యులు చూచుచుండినను దివ్యదేశము లైన విష్ణుక్షేత్రములయందు తీర్థప్రసాదములను గ్రహింపఁదగును, 39. విష్ణుసన్నిధియందు శ్రీవైష్ణవులచేత నియ్యఁబడిన ప్రసాదమును ఉపవాసాదినియమముల చేత నిషేధింపరాదు, 40. సర్వపాపహరమును పావనము నైన విష్ణుప్రసాదమునకు నెంగిలిదోషమునుగూడ నలఁపరాదు, 41. వైష్ణవసన్నిధానమున నెప్పుడును ఆత్మస్తుతిని చేయరాదు, 42. పరనిందను చేయరాదు, 43 మహాత్ములగు వైష్ణవుల కైంకర్యమును జేయునపుడు ఎప్పుడైనను విధించని కార్యమును జేయరాదు, 44. ఒకదినమందు గాని తుదకు నొక్కగడియయందు గాని గురువుయొక్క సద్గుణములను, నమ్మకముతో శఠకోపాద్యాగుల ప్రబంధములను కీర్తింపవలయును 45. దేహాభిమానముగలవారితో మాత్రము సహవాసము చేయరాదు, 46. వైష్ణవచిహ్నములను ధరించినవారైనను విషయాసక్తులుగానుండిరేని అట్టివారితో సహవాసము చేయరాదు, 47. ఎల్లప్పుడు నితరులదూషించు వారితో మాటలాడరాదు, 48. ఇతరదేవతాభక్తిగలవారి సహవాసమువలన గలిగెడిదోషము తొలఁగించుటకై మహాత్ములగు శ్రీవైష్ణవులతోడ మాట్లాడవలయును, 49. వైష్ణవనిందను చేసెడిజనులను చూడరాదు, 50. ద్వయానుసంధానమునందు ఈరెంటియందు నిష్ఠలగువారి సహవాసము ఎల్లప్పుడు చేయవలయును, 51. ఇతరవిషయ నిష్ఠులగు పురుషులను విడువవలయును, 52. భక్తిమార్గమున నాసక్తులగు వారితోగూడ నెల్లప్పుడు నుండవలయును, 53. రహస్యత్రయతత్త్వత్రయముల నెఱిగిన మహాత్ములతోఁగూడ నెల్లప్పుడు కూడియుండవలయును, 54. కేవలమర్థకాములతో నెప్పుడు

చేరరాదు, 55. భగవద్భక్తిగలవారితో నెల్లప్పుడు మాటలాడవలయును, 56. వైష్ణవులచేతనీవు తిరస్కరింపబడితివేని అప్పుడు వారలవారికి అపకారము తలంపక యూరకుండవలయును, 57. వైష్ణవులు పరమపదమునందు బుద్ధిగలిగెనేని ఇతరసమస్తవైష్ణవులకు హితము జేయుచుండవలయును, 58. విశేషప్రయోజనకారియయ్యును ధర్మరహితముగానుండెడికర్మను బుద్ధిమంతు డాచరింపగూడదు, 59. విష్ణు నివేదితముకానియన్నము నెప్పుడుభక్షింపరాదు, 60. పుష్పచందనతాంబూలజలాదులైన భగవదర్పితములు కానివాని ననుభవింపరాదు, 61. ఇతరసాధనములవలన కామాదిహేతువులచేత అయాచితముగాసిద్ధించినదైనను అట్టివస్తువును గ్రహించరాదు, 62. దేహమునకు ఇష్టములైనభోగములను భగవంతునికి నివేదనచేయరాదు, 63. శాస్త్రసమ్మతముగా ననుభవింపదగిన భోగ్యవస్తువులను నివేదింపనగును 64. భగవదర్పితమగునన్నపానీయాది సమస్తభోగ్యవస్తువులను ప్రసాదబుద్ధిచేతగ్రహించవలయునే కాని భోగబుద్ధిచేత ననుభవింపరాదు, 65. భగవత్కైంకర్యబుద్ధిచేత శాస్త్రోచితములగు సర్వకర్మలను చేయవలయును, 66. మంత్రత్రయార్థనిష్ఠులగుమహాభాగవతులకు అపచారము చేయుటకంటె ఆత్మనాశనహేతువు వేఱొక్కటిలేదు, 67. భాగవతులను సంతోషముపెట్టుటకంటె మోక్షహేతువగుకార్యము వేఱొక్కటిలేదు, 68. విష్ణు, భక్తులనుపూజించుటకంటె వేఱొక్క పురుషార్థములేదు, 69. వారితోటి ద్వేషమునకంటె ఆత్మనాశనహేతువును మఱియొకటిలేదు.

అర్చ్యావిష్ణౌశిలాధీర్గురుషునరమతిః వైష్ణవేజాతిబుద్ధిః
విష్ణోర్వావైష్ణవానాంకలిమలమథనే పాదతీర్థేంబుబుద్ధిః,
సిద్ధేతన్నామమంత్రే సకలకలుషహే శబ్దసామాన్యబుద్ధిః,
శ్రీశేసర్వేశ్వరేశే తదితర సమధీర్యస్యవానారకీ సః॥

ఎవనికైన విష్ణుపూజావిషయములో రాయియనియు, గురువులవిషయములో సామాన్యనరుడనియు, వైష్ణవులవిషయములో జాతియెట్టిది అనియును, కలిదోషమునుహరించునట్టి విష్ణువైష్ణవులపాదతీర్థమునందు సామాన్యజలమనియును, సకలపాపహరమగు తన్నామమంత్రమందు సామాన్యమగుశబ్దమనియును; సర్వేశ్వరేశ్వరుడగు విష్ణువునందుతదితరులతోటి సామాన్యబుద్ధియును; కలుగుచున్నదో వాడేనరకప్రాప్తిగలవాడు, కాబట్టి ఓయిశిష్యుడా, భగవంతునినారాధించుటకంటె భాగవతులపూజశ్రేష్ఠమనియు, విష్ణుతిరస్కారమునకంటె వైష్ణవతిరస్కార మెక్కుడు పాతకమనియు, విష్ణుపాదతీర్థమునకంటె వైష్ణవపాదతీర్థముశ్రేష్ఠమనియును తలచి ఎల్లప్పుడు జాగరూకుడవై సత్పురుషులగు వైష్ణవుల నారాధించుటయందు నిష్ఠకలిగియుండవలయును.

శ్రీమద్భాగవతార్చనం భగవతఃపూజావిధేరుత్తమమ్
శ్రీవిష్ణోరవమాననాద్గురుతరం శ్రీవైష్ణవోల్లంఘనమ్
తీర్థాదచ్యుతపాదజాద్గురుతరం తీర్థంతదీయాంఘ్రిజమ్
తస్మాన్నిత్యమతంద్రితోభవసతాం తేషాం సమారాధనే॥

ఇట్లు మూఁడుదినము లహోరాత్రము శిష్యులకు హితోపదేశము చేసి రంగనాథు ననుజ్ఞనడసి నిజయోగబలముచే బ్రహ్మరంధ్రముద్వారా ప్రాణత్యాగము సేసి కీర్తిశేషుండాయెను. శిష్యులందఱు హాహానాదములచే రోదసీకుహరమునించిరి. లోకమంతయు సూర్యుఁడులేని పగటివలె తేజోహీనమాయెను. ఐనను రామానుజార్యుని దివ్యమంగళవిగ్రహము నశించినదని అతనిశిష్యులప్పుడు దుఃఖించినట్లు మనమును దుఃఖపడవలసినవారమే కాని అతనియాత్మమాత్రము ఇప్పటికిని వైకుంఠమునందుండి ఆదిశేషరూపంబున వైష్ణవులకృత్యముల పరీక్షించుచు వైష్ణవులక్షేమమును అభిలషించుచునే యున్నది.

# ఉపసంహారము



శ్రీరామానుజాచార్యుఁడు అనంతుని యవతారము కాదనియు, వైష్ణవులలో కొంత ప్రజ్ఞావంతుఁడును పండితుఁడునై యుండ వారతఁడు ఆదిశేషుని యవతారమని యొకకట్టుకథ నల్లిరే కాని అతఁడు వాస్తవముగ అనంతుని యవతారమై యుండిన ఆవిషయము పురాణములందు సూచింపఁబడి యుండదా అని అన్యమతస్థులు కొందఱాక్షేపింతురు. ఐన వాస్తవముగ పురాణములను శోధించిన వారిట్టి తుచ్ఛవాదము సేయరు. రామానుజార్యుని యవతార మనేకపురాణములయందు సూచింపఁబడియున్నది. అతనిమహిమ అనేకగ్రంథములయందు కొనియాడఁబడియున్నది. అతఁడాదిశేషుని యవతారమనుటకనేకప్రమాణములు గలవు.

1. యాదవాచలమాహాత్మ్య.

శ్లో॥ అనన్తః ప్రథమం రూపం ద్వితీయం లక్ష్మణస్తథా
తృతీయం బలరామశ్చ కలౌ కశ్చిద్భవిష్యతి.

తా॥ మొదటిరూపము ఆదిశేషుఁడు. అనంతరము త్రేతాయుగమున లక్ష్మణుఁడు. రెండవరూపము బలరాముఁడు. మూఁడవరూప కలియుగమునందు ఒకరూపముకలుగఁబోవుచున్నది.

ఒకదినము కాలక్షేపగోష్ఠిలో శిష్యులు, “స్వామిన్, ‘కలౌకశ్చిద్భవిష్యతి’ అనువాక్యమునకు యథార్థమైన భావమును సాయించవలె” నని మిక్కిలిప్రార్థింపఁగా రామానుజార్యుఁడు “అహమేవ” అని మెల్లగా యర్థము సెప్పిరి.

2: హారీతస్మృతౌ హారీతం ప్రతి భగవాన్

శ్లో॥ బ్రహ్మన్ కలియుగేప్రాప్తే ధర్మేనష్టేప్రశాంతరి తే.
మద్భక్తస్సర్వధర్మజ్ఞస్తవగోత్రసముద్భవః
శారీరకమహాభాష్య గ్రన్థకర్తాజితేన్ద్రియః
తస్యసంబన్ధినశ్శిష్యాస్సురాణామపిదుర్గమామ్
మామప్రాప్యైవతేసర్వేగమిష్యన్తిపరాంగతిమ్.

తా॥ హారీతస్మృతియందు హారీతమహర్షితో భగవంతుఁడిట్లు చెప్పినట్లున్నది:—ఓబ్రహ్మర్షీ, కలియుగమునందు ధర్మమునశించినప్పుడు నాభక్తుఁడు సర్వధర్మములు తెలిసినవాఁడు, జితేంద్రియుఁడు, శ్రీమహాభాష్యమును రచింపఁగలవాఁడు, నీవంశమునఁబుట్టఁగలఁడు, అతనిసం

బంధులగు శిష్యులు అందఱును సురలకు గూడ పొందరాని నన్ను పొంది పరమపదము సేరెదరు.

3. బ్రహ్మాండే బదరికాశ్రమ మాహాత్మ్యే.

శ్లో॥ మన్నియోగాద్భూతపుర్యాం మహీనామీశ్వరః కలౌ
శ్రీరామానుజరూపేణ భవిష్యతి సతాం ముదే
విశిష్టాద్వైతసిద్ధాన్తప్రతిపాదనతత్పరః
భాష్యం నిర్మాతి వేదాన్తసూత్రాణామస్తి తత్త్వవిత్
సదాశ్రయాస్సదాచారాస్సాత్త్వికాస్తత్త్వదర్శినః
వేదాన్తద్వయతత్త్వజ్ఞాః భవిష్యన్తి గురూత్తమాః.

తా॥ బ్రహ్మాండపురాణము బదరికాశ్రమమాహాత్మ్యమునందిట్లున్నది:—నానియోగమువలన కలియుగమునందు భూతపురిలో ఆదిశేషువు రామానుజుఁడను పేరితో నవతరించి విశిష్టాద్వైతసిద్ధాంతమును ఉజ్జీవింపఁజేసి బ్రహ్మసూత్రముల తత్త్వమునరసి భాష్యమునురచించును: అతని వెనుక అనేకులు గురువర్యులు సదాచారులును, సదాశ్రయులును, సాత్త్వికులును, వేదాంతద్వయతత్త్వము నెఱిఁగినవారును, తత్త్వము నితరులకు చూపఁగలవారును గలుగఁబోవుచున్నారు.

4. బ్రహ్మవైవర్తే - ఏకోనత్రింశదధ్యాయే- అగస్త్యం ప్రతి భగవాన్

శ్లో॥ అగస్త్య తే భద్రమస్తు తపో మా మత్పరో భవ
త్వద్వేదవిద్యా మద్భక్తైః పాలితాస్యా త్పునః పునః.
అనన్తగరుడాదీనాం సూరీణాం నిత్యయోగినామ్
అంశోద్భూతా మహాభాగా జాయన్తేహ మదాజ్ఞయా.

తా॥ బ్రహ్మవైవర్తపురాణమందు భగవంతుఁడగస్త్యునితో నిట్లు చెప్పుచున్నాఁడు:—అగస్త్యమహర్షీ, నీకు శుభమగుఁగాక! తపస్సును విడువుము, నాయందుభక్తికలవాఁడవగుము. నీవేదవిద్య (అనఁగా ద్రవిడ వేదము) నాభక్తులచే మాటిమాటికి పాలింపఁబడును. ఆదిశేషువు, గరుడుఁడు, మొదలగునిత్యసూరుల యంశముల నాయాజ్ఞచే భూలోకమున మతస్థాపకులు పుట్టుదురు.

అని కాసారభూతయోగ్యాదుల యవతారములను దెలుపుచుఆపరంపరలో.

శ్లో॥ పరాఙ్కుశః కవి ర్మిశ్రః కలౌ రామానుజో మునిః
ఏతే చాన్యేచ బహవో మద్భక్తా స్సజ్జవర్జితాః.

ఇఁతవఱకు పురాణములయందలి రామానుజావతార మహిమాభి

వర్ణనము వివరింపఁబడియె. ఇంక వైష్ణవగ్రంథములందు గురువర్యుని ప్రభావము అపారముగ వర్ణింపబడియున్నది.

5. శ్రీప్రపన్నామృతే.

శ్లో॥ శ్రీరామో భగవాన్ పూర్వం తత్ర జ్యేష్ఠో భవద్యథా
తథైవాభూత్ కలియుగే శ్రీమాన్ లక్ష్మణదేశికః
శాలివాహశకాబ్దానాం తత్రాష్టత్రింశదుత్తరే
గతే నవశతే శ్రీమాన్యతిరాజో జనిష్ట వై.

తా॥ త్రేతాయుగమునందు శ్రీరామచంద్రుఁడెట్లు జ్యేష్ఠుఁడయ్యెనో అట్లే కలియుగమునందు లక్ష్మణదేశికుఁడు జ్యేష్ఠుఁడయ్యెను (అనఁగా రామాంశమునంబుట్టిన కూరేశునికన్నను, భరతాంశమునఁబుట్టిన దాశరథికన్నను లక్ష్మణార్యుఁడు పెద్దవాఁడుకదా?)

శ్రీమన్నాథముని శఠారియొద్ద శుశ్రూషసేయుచు ఒకనాఁడు.

6. స్వామిన్ సహస్రగీత్యాంతు హ్యావతారాది సూచకః
మహతః కస్య చిచ్చాత్ర పద్యం కించిత్సమీరితమ్
తస్యార్థం కృపయా బ్రూహి కరుణాకర మేధునా.

తా॥ ఓస్వామీ, ద్రవిడప్రబంధమునందు ఒకమహాత్ముని యవ

తారమునూచింపఁబడియున్నది. ఆశ్లోకము యొక్క అర్థము దయచేసినాకు ఇప్పుడే అనుగ్రహింపుఁడు.

అని విన్నవింపఁగా శఠకోపయతి మంచిది ఎఱిగింతునని యొకశిల్పికి తాను భవిష్యదాచార్యవిగ్రహ స్వరూపియై స్వప్నమున ప్రత్యక్షమై ఆరూపముతో నొకవిగ్రహము సిద్ధము చేయించి నాథమునికిచ్చి యావిగ్రహమును దన్నుఁగాభావించి యారాధించుచుండిన అతనికా యర్థము తెలియఁగలదని ఆనతిచ్చిరి. అంతనావిగ్రహము నాథముని తనయ వసానదశయందు ఉయ్యకొండారుకున్న, ఉయ్యకొండారు మణక్కాల్ నంబికిని, అతఁడు యామునమునికిని, అతఁడు గోష్ఠీపూర్ణునికిని, ఇచ్చెను. ఆవిగ్రహమట్లుపరంపరగావచ్చి రామానుజార్యుఁడు గోష్ఠీపూర్ణు నొద్ద తిరుమంత్రార్థోపదేశము నొందఁగా నంతర్ధానము నొందెను. హా! ఇలయాళ్వార్ల మహిమ అవాఙ్మానసగోచరము:—

7. యతో భవిష్యదాచార్య విగ్రహో యతిపుఙ్గవే
లీనఆసీ త్తత స్తస్మా ద్గురోః కో న్యోధికో భువి.

తా॥ ఏకారణముచేత భవిష్యదాచార్యవిగ్రహము (రాఁబోవునాచార్యునివిగ్రహము) యతీంద్రునియందు చేరిపోయెనో ఆకారణముననే అతనికంటెనధికులగు గురులు లోకమునలేరు.

శ్రీకాంచీనగరమున మూగయగు నొకవైష్ణవబాలుఁడు అందఱును చూచుచుండఁగా పెరిగి ఉన్నటులుండి రెండుసంవత్సరము లగపడకపోయి మరలవచ్చి మూగతనములేక మాటలాడుచు కనబడఁగా పురజనులు చూచి.

“త్వ మేత తాబ్ధిపర్యంతం మాక కుత్ర నిరో హ్యసి” అనియు డుగఁగా అతఁడు రామానుజాచార్యుఁడు తన్ననుగ్రహించినదియు తాను క్షీరాబ్ధికిపోయివచ్చినదియు మొదలుగాఁగల యావద్వృత్తాంతమును చెప్పి యతీంద్రునిమహిమ కొనియాడి తిరోహితుఁడయ్యెను.

కూరేశుఁడు కావేరిలో స్నానము చేసి ఆర్ద్రవస్త్రముతో.

సత్యం సత్యం పున స్సత్యం యతిరాజో జగద్గురుః
స ఏవ సర్వలోకానాం సముద్ధర్తా నసంశయః॥

ఇట్లు పురాణికులును అనేక మహాత్ములును ఏకగ్రీవముగా రామానుజాచార్యుఁడు ఆదిశేషునిఅవతారమనియు లోకగురువనియు అతనిమహిమ నభివర్ణించి చెప్పుచుండఁగా ఇంకను సంశయావిష్టమానసులగు వారి మౌఢ్య మేమని చెప్పవచ్చును.

శ్లో॥. శ్రీభాష్యం ద్రవిడాగమప్రవచనం శ్రీశస్థలే ష్వన్వహమ్
కైంకర్యం యదుశైలనిత్యవసతి స్సార్థంద్వయోచ్చారణమ్
యద్వా భాగవతాభిమాన వసతి శ్రేయ స్స్వతా మిత్యలమ్
శిష్యాన్ ప్రాహ యతీశ్వరః పరమగాద్విష్ణోః పదం శాశ్వతమ్॥

శ్రీమద్రామానుజచరిత్రము

సంపూర్ణము.



# అపూర్వ గ్రంథముల ప్రకటన:

## 1. మణిత్రయి.

శ్రీమచ్ఛంకర భగవత్పాద తచ్ఛిష్య విరచితములయిన మూడు స్తోత్రములు, (1) శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము, (2) శ్రీగోవిందద్వాదశ మంజరికా స్తోత్రము, (3) శ్రీగోవిందచతుర్దశ మంజరికా స్తోత్రము, ఈ మూడుస్తోత్రములును ఆంధ్రటీకాది సహితముగా 32 పేజీలలో సుందరమగు చిన్నసైజున యాబయి రతుల గ్లేజుకాగితములయందు ముద్రింపఁబడి కిత్తానుబయిండు చేయఁబడిన ప్రతి 1-కి రూ. 0-8-0.

## 2. శ్రీమద్రామానుజ చరిత్రము.

శ్రీపెరుంబూదూరులో అవతరించిన ఉడయవరుల చరిత్రము నంతయు వచనరూపముగా అచ్చటచ్చట ఉపనిషత్తులాదిగాఁగల, ఉదాహరణములును అందుకు టీకయును సంస్కృత ప్రపన్నామృతమును అనుసరించి వ్రాయఁబడియున్నది. అరవైపౌనుల గ్లేజు కాగితములయందు. రాయల్ ౧౬ పేజీలసైజులో ముద్రింపఁబడి కాలికోబయిండు గిల్టుపేరు వేసిన ప్రతి 1-కి రూ. 1-0-0.

### 3. ఆంధ్రపద్యరత్నమాల.

ఇది, 'ఆదికవులచే చేయఁబడిన (1) భారతము, (2) నిర్వచనోత్తర రామాయణము, (3) హరివంశము, (4) ఉత్తరహరివంశము, (5) శృంగారనైషధము, (6) హరవిలాసము, (7) భాగవతము మొదలగు గ్రంథములనుండి రసవంతమయిన పద్యములను ఏర్పరచి ఆపద్యములకు సందర్భములు, లఘు టీక అలంకారములు మొదలగువానితో వ్రాయబడియున్నది. 26 రతుల గ్లేజు కాగితములయందు క్రవున్ 16 పేజీల సైజులో ముద్రింపఁబడి కాలికోబయిండు చేయఁబడిన ప్రతి 1-కి రూ. 1-0-0.

### 4. శ్రీరుద్రాధ్యాయము.

శ్రీరుద్రము, నమకము, చమకము, అను రెండు ప్రశ్నములను స్వరయుక్తముగా రుద్రభాష్యాంధ్ర వివరణమను పేరుగలటీకతో ముద్రింపఁబడినవి. యాబయిరతుల గ్లేజు కాగితములయందు రాయల్ 16 పేజీల సైజులో ముద్రింపఁబడి కిత్తానుబయిండు చేయఁబడియున్న క్రయము ప్రతి 1-కి రూ. 1-4-0.

### 5. ఉత్తరగీత.

ఆంధ్రతాత్పర్య సహితము గ్లేజుకాగితములయందు డిమ్మి 8 పేజీ సైజులో ముద్రింపఁబడినది ప్రతి 1-కి రూ. 0-4-0.

### 6. హఠయోగ ప్రదీపిక.

హఠయోగశాస్త్రమునను ఆంధ్రతాత్పర్య విశేషార్థములతోను యోగాసన పటములును గలవి కాలికోగిల్టు బెండు, క్రయము రూ. 3-0

## 7. విచారసాగరము

ఆంధ్రవచనముగా- శ్రుతి-స్మృతి ఉదాహరణములతో చెప్పబడి యున్నది. అద్వైతమందుగల విషయములు యావత్తు నిందువల్ల గ్రహింపదగియున్నది. కాలికోగిల్టుబయిండు ప్రతి 1-కి రూ. 2-12-0.

## 8. శ్రీ స్తోత్రరత్నపంచకము.

(1) శ్రీ వేంకటేశ సుప్రభాతము, (2) శ్రీ కృష్ణావతార ఘట్టము, (3) శ్రీ గోపికాగీతలు, ఆంధ్రపద్యసహితము, (4) ముకుందమాల, (5) గజేంద్రమోక్షము, ఈయయిదుస్తోత్రములును, ఆంధ్రతాత్పర్యములో రాయల్ 32 పేజీలుగల చిన్నసైజులో 60 పేనుల గ్లేజుకాగితములయందు ముద్రింపఁబడి కిత్తానుబయిండుచేయఁబడిన ప్రతి 1-కి రూ. 0-8 0.

## 9. ముహూర్తకంఠాభరణము.

కృష్ణమిశ్రప్రోక్త సంస్కృత వ్యాఖ్యానసహిత, అపూర్వ జ్యోతిష ప్రశ్న గ్రంథరత్నము. తెనుఁగు తాత్పర్యముతో గ్లేజుకాగితములయందు, డిమ్మి 8 పేజీలసైజులో ముద్రింపఁబడియున్నది. క్రయము ప్రతి 1-కి రూ. 0-6-0.

## 10. యజుర్వేదాహ్నికము.

(1) బ్రాహ్మముహూర్తకర్తవ్యమ్, (2) దేవర్షి పితృతర్పణమ్ (3) ప్రాతస్సన్ధ్యావన్దనమ్, (4) బ్రహ్మయజ్ఞమ్, (5) మాధ్యా

హ్నికమ్; (6) శ్రీ సజ్జ్వైహి భగవదారాధన క్రమస్సమన్త్రికః, (7) సాయంసన్ధ్యావన్దనమ్, (8) యజ్ఞోపవీతధారణక్రమః, (9) ఉపాకర్మ వజాల్పజపాదిక్రమః కాణ్డఋషితర్పణమ్, (10) సమిదాధానమ్, (11) అధ్యయనహోమమ్ - సార్థమ్, (12) పుణ్యాహవాచనమ్, (13) తైత్తిరీయోపనిషత్, (14) పఞ్చసూక్తములు, ఈ పదినాలుగు విషయములు బ్రాహ్మణుల కత్యంతోపయోగకముగా నుండులాగున క్రవున్ 16 పేజీల సైజులో మంచి గ్లేజు కాగితములయందు ముద్రింపఁబడి కిత్తానుబయిండు చేయఁబడిన ప్రతి 1-కి రూ. 0-8-0.

**K. TIRUVENKATA CHARLU,**

*Bookseller & Publisher.*

No. 4. DHARMARAJA TEMPLE STREET,

*Washermanpet,*

**MADRAS.**